# క్రాంతి

గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి

అరుణాశ్రమము
నడకుదురు
కాకినాడ

# పీఠిక

శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగా[illegible]ల.,
మాజీ మదరాసు శాసనసభాధ్యక్షులు
బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరుజిల్లా.

"అవధానిశేఖర" గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రిగారు రచించిన "కుంతి" కావ్యము చిన్నదయ్యును భావగాంభీర్యమున శైలీసారళ్యమున పెద్దదనియే చెప్పదగును.

కుంతీదేవి జీవితసంగ్రహమును ఆత్మకథగా చిత్రించి ఆమహావీర మాత హృదయవేదనను పదునాలు వీచికలుగా నిర్మించి క్షత్రియధర్మములను ప్రకటించి సతీత్వమును సమర్థించి మాతృత్వమును చక్కగ పోషించి క్రొత్తపోకడలలో విహరించిన కవిశక్తి గణనీయము.

కన్యాత్వమున తొలిచూలుఫలము అనుభవయోగ్యము కాఁజాలనందున కలిగిన తొట్రుపాటుచే నగ్గలికఁబడిన ముగుదయెడఁద తొలియలలో నూఁగెను.

పెండ్లితలంపు పాతివ్రత్యభంగభయము, "పతియే దైవము దైవమే పతియు" యనెడు సంశయవివేచనము రెండవయలయం దిమిడెను.

"కోటిసూర్యప్రభానీకాశ దివ్యదేహుఁ" డగు పుత్రుని వియోగ చింత మూఁడవయలయం దుప్పొంగెను.

అపరాధనివేదనముచే ఆత్మనివేదనముచే పతియెడఁద కరుణ జాలువాఱఁ జేయుచు మంత్రశక్తిమూలమున సుతులఁ బడయుట దూష్యము కాదనియు వంశక్రమాగత మనియు జ్ఞప్తిపఱచి నాల్గవవీచిక శోభించెను.

చెల్లెలగు మాద్రికి కులము నిల్పవలసిన యావశ్యకతను పతివాంఛను సంతానానందమును ఆడపుట్టుకకు మాతృత్వసరమావధిని ప్రబోధించి పంచమవీచిక ప్రజ్వలించెను.

దుర్భాగముచే పతి గతించినను తన పర్యవేక్షణమున "కౌంతేయ మాద్రేయులే ధీరాగ్రేసరు లన్న కీర్తి"ని వినుటకై పుత్రసంరక్షణార్థమై కుంతి మేను త్యజింపక నిల్చినది సమర్థనము ఆఱవవీచికలో చిత్రితమయ్యెను.

ఇట్లే క్రమముగా రాచఱికపు ఠీవి గంభీరత కార్యసాధనోద్యోగము వాంఛితఫలానంతరమున జీవితముపై కల్గిన విరక్తి "కాన కేగి పరసౌఖ్యశ్రీ నుపార్జించు" జతనము ఆయత్నమున పరిభవము కర్ణదర్శనముచే చిత్తభారనివారణము ఆనందము తీరిపోవుటకు మున్నే క్లిష్టజీవితాధ్యాయము ముగించుకొనుట మున్నగు గభీరభావపరంపరయా తేజోరాశిని చక్కగ చిత్రించెను.

కవి కుంతిపాత్రను అందముగ పోషించుచు కర్ణపాత్రకు ప్రాధాన్య మిచ్చెను.

"తెరవెన్క భాగవతము" "గూండ్లు కట్టుకొని యున్నవి బెంగలు చిత్తమందు", ఇత్యాదిజాతీయము లటనట పొదుపబడి కవిచమత్కృతికి వన్నె బెట్టెను.

కవిత్వమునందలి పటుత్వమును భావములయందలి గాంభీర్యమును శైలియందలి సంపదను చవిగొన నభిలషించు సారస్వతాభిమాను లీకృతిచే కొంత తనివి నందగలరని నా నమ్మకము.

బెజవాడ రామచంద్రారెడ్డి,
22—2—46.

# పరిచయము.

కవిసమ్రాట్,

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు

"కవితారీతు లనంతముల్ కవుల సంస్కారానుకూలమ్ముగా
నవభాసించు- తదంతరస్ఫుటరసాస్వాదప్రకారమ్ములున్
వివిధంబుల్- ధర నందఱన్నిటను దృష్టిం బొంద రేయల్పపుం
గవితల్ సైతము నాదరింపఁబడు లోకంబందు నేదోయెడన్॥"

ఈ పద్యము కవియొక్క విజ్ఞానమున కుదాహరణము. ఈయన వ్రాసిన కావ్యము చిన్నది. కవితాశక్తి యసామాన్యమైనది. ఈకావ్యమునందు రెండు భిన్నశక్తుల సంయోగము కలదు. అవి రెండును సామాన్యముగా కలిసి యుండవు. ఈ రెంటికలయిక నన్నయ్యగారిలో నున్నది. పెద్దన్నగారిలో నున్నది. తెలుఁగులో మఱియొక కవియందు కనిపింపలేదు. ఇందు మొదటిది మధురమైన పద్యరచన. ఈ మాధుర్య మెక్కువయైనంత నే లోకమున ననేకకవులయందు కావ్యరచనాశిల్పము కనిపించుట లేదు. రెండవది కావ్యరచనాశిల్పము. ఈరచనాశక్తి బహువిధముల నుండును. అందొకవిధము కథను నడుపుటలోని నేర్పు. మఱియొకఁడు బహుకథాంశములను ధ్వనితములను జేసి రమ్యతను సంపాదించుట. ఈ రెండులక్షణములు "కుంతి" యన్న యీ చిన్నికావ్యములో కన్పించుచున్నవి. ఈకవిశక్తికి చిన్నదయిన యీకావ్యము చాలదు. ఈయన యన్నట్లుగా నీకావ్య మీదేశమున నెందఱమంది గ్రహించి యానందింపఁగలుగుదురో యన్నది సందేహమైన విషయము. ఇట్టి కావ్యమునందు నాధునికమైన వస్తుసామగ్రి లేదు. ప్రచారబహుళమైన భావసామగ్రి లేదు. ఒక పూర్వకథ శిల్పచాతుర్యముతో చెప్పిన పద్ధతి యొకఁడే కలదు. అచ్చమైన శిల్పమునం దభిమాన మున్న నేగాని యిట్టిగ్రంథమునకు ప్రశస్తి రాదు.

కుంతి నాధారముగాఁ జేసికొని యిందు భారతకథ యంతయు చెప్పఁబడిన దన వచ్చును పూర్వోత్తరఖండము లని రెండు. రెండును కలిపి పదునాఱు శీర్షికలు.

ఈకావ్యమునందు చేయఁబడిన కుంతిసృష్టి యపూర్వముగా నున్నది. కవియొక్క కుంతీ చిత్రణ మంతయు ధ్వనితమై రసారామపథమ్ముల విహరించుచున్నది. కుంతి బహుసన్నివేశములయందు తా ననిన మాటలనుబట్టి యామె జీవలక్షణము మిక్కిలి చిత్రముగా కనిపించుచున్నది. ఆమె ప్రధానముగా రాచవనిత.

"ధరపై క్షత్రియకాంత వీరజననీత్వం బొక్కఁడే జన్మకున్,
పరమార్థంబుగఁ జూచు"

ఇది యాకుంతియొక్క మూలభూతమైన మనోద్రవ్యలక్షణము. కొడుకులయందు ప్రేమ కలదు. కర్ణునియందు ప్రేమ కలదు. దుఃఖము కలదు. బాధ కలదు. మోక్షము సందాస, సర్వమనుష్యభావములు కలవు. కాని యామెయొక్క క్షత్రియకాంతాలక్షణమే చిత్రముగా సర్వకావ్యమునందు వ్యంగ్యభూత మగుచున్నది. ఈభావము కర్ణునితో నామె మాటాడునప్పుడును అతనినిగూర్చి కృష్ణునితో చెప్పునపుడును మఱియు సందముగా ధ్వనిత మగుచున్నది.

"ఆగుము నీమనోరథ మనర్థము, నిక్కపుతల్లివోలె నే
బాగొనరింతు నీవిషమభావిపథమ్మును, సంశయింతువా?
మూగతనంబుతో వెడలిపోవఁ గరమ్ముల మోడ్చుచుంటివా?
ఏగుము నీయదృష్టమున కెవ్వరు కర్తలు ధూర్తబాలుఁడా!"

ఈరాచవనితతనము, తల్లియై అతని నంత ప్రేమించుచు దైవమునం దింతటి విశ్వాసము, తనప్రేమను పరాధికఫలాపేక్షచే నొత్తిగిలఁబెట్టఁగలిగిన సామర్థ్యము, ఇంక కర్ణునియొక్క మాతృభక్తితో కూడిన స్వేచ్ఛావృత్తి- ఇవియన్నియు రమ్యముగా వ్యంగ్యభూతము లగుచున్నవి. మఱియు నామె కర్ణునిగురించి కృష్ణునితో;

"కౌరవ్యాళితోఁ బాటుగా
తానుం జచ్చునో! చచ్చి నాయెడఁదఁ జింతాజ్వాల రెట్టించునో!
పోని మ్మాతనిఁగూర్చి యేడ్వనిదినంబుం గల్గనే మాధవా!"

అనెను. ఈ నిరంతరదుఃఖము ఈ నిరంతర కౌరవప్రతీకారాగ్ని జ్వాల యీ రెండు భావములకలయిక యీ మెహృదయములో చిత్రముగా నున్నది. ఈసృష్టి పరమ రమణీయముగా నున్నది.

ఈమె శ్రీకృష్ణదేవునికంటె నధికురాలుగా కన్పించుచున్నది.

"నామేనల్లుఁడు కార్యవాది యగు కృష్ణస్వామి లోకావన
వ్యామోహంబున రాయబారి యయి రానై యుండె"

పరమేశ్వరునకు లోకావనవిషయమున వ్యామోహమట. విష్ణుదేవుని స్వరూప మంతయు వ్యాఖ్యాత మైనట్లున్నది. ఆయన "కార్యవాది" యట. ఖడ్గవాది కాదు. ఆమె కృష్ణునితో పలుకుచు,

"కృష్ణా! కృష్ణయున్ భీముఁ డీ
ఖేదోక్తుల్ వినిరో! సహించి యెటు లంగీకారముం జూపిరో!"

అని యడుగుచున్నది. తనకు భీముఁ డెట్టివాఁడో కృష్ణ యట్టిది. ఆకోడలు సరిగా తనవంటిది. ద్రౌపదినిఁగూర్చి కుంతియొక్క మనోభావము ఈ యొక్కమాటచేత విస్పష్టము చేయఁబడినది. ద్రౌపదీప్రస్తావన ఈ కావ్యమున నెచ్చటను లేదు. పాత్రపోషణ మనఁగా క్రిందఁబడి మీఁదఁబడి విఱుగఁబడి చచ్చుట కాదు. ఒకవ్యక్తియొక్క మనోభావము చిత్రించుట కొక్కమాట చాలును. కుంతి కర్ణుని "ధూర్తబాలుఁడా" యని పిలుచుటవంటిది. కర్ణుని సర్వప్రకృతియు నందు వ్యంగ్యభూతమై యున్నది. ఇట్టి రచన చేసినవాఁడే కవి. తక్కినవాఁడు కవి కాఁడు. వాఁడు పద్యములు వ్రాయువాఁడు. మధురముగానో సుందరముగానో వ్రాయఁగలవారు వందలకొలఁది నుందురు.

ఈయనరచన మిక్కిలియు ధ్వని ప్రధానముగాఁ గలదు. కుమారాస్త్రవిద్యాప్రదర్శనమున కుంతి యర్జునునిఁ జూచి;

"ఔరా! వీనికి నుద్దియై నిలువ శక్యంబే పురారాతికిన్?"

అని యనుకొనును. ఇది చక్కని సూచ్యార్థసూచనము. భారతీయసాహిత్యశిల్పములో నంతర్వ్యాఖ్యాతమైన యొకవిషయము. మఱియు కర్ణుఁ డర్జునునిచేత చచ్చె నని విని

"పార్థుఁడు నినుఁ గొట్టి చంపెనఁట దుష్టుఁ డిసీ!"

అనెను. ఆయర్జునిని దుష్టుఁ డనుట చిత్రముగా నున్నది. ఈకుంతి యెటువంటిది? కృష్ణదేవునికంటె నెక్కువ ధర్మనిష్ఠురాలా? జగద్రహస్య మంతకంటె నెక్కువ తెలిసిన దానయా?

మొదటి శీర్షికలో రచన యొకచిత్రము. తాను పదిరెండేఁడుల కన్య. స్త్రీత్వ మన నెట్టిదో తెలియదు. మాతృత్వ మెట్టిదో అంతకుముందే తెలియదు. కాని మాతృత్వ మునం దాశ లేదో! అట్టికోరిక స్త్రీయై జన్మించుటతోనే యున్నదేమో!

"మాదృశబాల కిప్పు డే
మంత మునింగిపోయె నని యామునిచంద్రుఁ డొసంగె నింతకున్?"

అనుచున్నది. మాతృత్వము తనకు ప్రియమైనదే. దానికోసము తాను తొందఱ పడనక్కఱలేదు. Pearl Buck వ్రాసిన 'తల్లి' యన్న నవలలో స్త్రీయొక్క యౌవనోదయపూర్వమునందుఁగూడ నీమాతృత్వభావన యెట్లుండునో యామె వ్రాసెను. ఈ రచన యారహస్యస్ఫురితముగా నున్నది.

సూర్యుఁడు తన కన్యాత్వము పోదని యనుగ్రహించెను. అయినచో
"ఈ తెరవెన్క భాగవత మేటికి నే నకలంక నైనచో?"

అని కుంతి ప్రశ్న. ఈలోకోక్తి కర్ణుని జన్మరహస్య మెంతచిత్రముగా ధ్వనితము చేయునట్లు ప్రయోగింపఁబడినది? ఇట్లు లోకములోని మాటలు పరమరమ్యార్థప్రతిపాదకములుగా వాడుట ప్రతిభాలక్షణము.

"మాయావుల్ తమయంత పంచుదురె సామాన్యంబుగా రాజ్యమున్?"

ఇచట సామాన్యమ్ముగా నన్న శబ్దముయొక్క యర్థము చమత్కారజనకము. కవి యిచట నూత్నార్థసంధానము చేయుట కాదు ఉన్నదాని నున్నట్లుగా ప్రయోగించుట. ఇట్టిమాటలను నన్నయ్యగారు వాడుదురు. సామాన్యముగా ననఁగా ప్రయత్నరహితముగా నని యర్థము. ఈయర్థమునందే లోకమున వాడఁబడుచున్నది. దాని నట్లే వాడుట తెలిసి వాడుట యనిపించుకొనును.

ఈయన కొన్ని సమాసములను ప్రతిభాద్యోతకములుగా చేయును. మాద్రియు పాండురాజును స్వర్గమునం దుండి శృంగారసర్వస్వమును "సుధాసేవాపండితు లౌచు

చూరగొందురట" ఈసుధాసేవాపండితశబ్దము రహస్యముగా నున్నది. స్వర్గమునందు సుధాసేవనము జరుగును. అది వాచ్యార్థము. శృంగారవిషయికముగా సుధాసేవనము. ఇది గౌణార్థము. ఇట్లు అర్థశ్లేష యగుచున్నది. కాని ఈశ్లేషధ్వని పొలిమేరలను తాకుచున్నది. కుంతికి లేనట్టి బిడ్డలను పెనుభార మవశ్యరూపమై నిలిచెనట. అవశ్యరూపమన్న సమాస మొక ప్రౌఢమైనది. అవశ్యమన్న శబ్దార్థము విచారించగా లోకమర్యాద యనునర్థము సిద్ధించునేమో! దానిభావ మీరూపము.

ఇట్టీకావ్యమునందు ఉత్తమకవితాలక్షణములు మిక్కిలిగా నున్నవి. కాని యీ కవిమీద నచ్చముగా నాధునికకాలము తనముద్ర యిడలేదనుటకు వీలు లేదు. ఆముద్రలు నిండుగనున్నవి. 'ధనికలోకము' 'చిరవిప్లవము' 'సంఘము' మొదలైన మాటలు కలవు. ఆమాటలతో కొన్ని యర్థములు వానియందెట్ట వివియే వచ్చెను. సంఘమునకు పూర్వులు లోకమని వాడుదురు. హృదయములోన గగ్గోలు పడుటకు పూర్వులు విప్లవమని వాడ లేదు. ధనికలోక మన్నమాట సరే. 'ఆదర్శ'మను శబ్దము (Ideal) అన్న యర్థములో నేటి తెలుగువారు వాడుచున్నారు. దాని కాయర్థము లేదు. ఈకవికూడ నాధునికుల వలెనే వాడెను,

ఈయనయందు నిగూఢమైన కవితాశక్తి కలదు. నిర్వాణములో నలుబదియాఱవ పుటలోని చివరి రెండుపద్యములను చూడుడు. సూర్యుడు కనిపించినంతనే కుంతి పడిన తికమక చాల సొగసుగా నిరూపింపబడినది. దీనిని చిత్రణ మందము. అనుటయేగాని అదికూడ వ్యంగ్యమే.

మాద్రిని ప్రలోభపెట్టుటలో కుంతియొక్క భావన చమత్కారముగా నున్నది. అది ధర్మమని కుంతికి తెలియును. కాని యధర్మమేమో యని భీతి సందడించుచున్నది. ఒకధర్మము తాత్త్వికముగా ధర్మమై లోకాచారముచేత నధర్మముగా భాసించుచున్నట్లుండును. మనము చేసిన తప్పు పరులుకూడ చేసినచో కొంత తృప్తి. వారిచేతకూడ చేయించుట కొక సన్నని ప్రయత్నము, చేయుదుము, ఇచట కుంతిపాత్రలో నొక నిద్దాతనము లేకపోయినను మానుషత్వము భాసించి చమత్కారముగానే యున్నది. దీని కొక్కటియే కారణము. సూర్యదేవుడామె కన్యాత్వభంగము లేకుండనే యనుగ్ర

హించెను గాని లోకాచారభీతి లేకుండ ననుగ్రహింపలేను. కుంతి యెదలో నాబాధ బాధగానే యున్నది.

ఒక అనిశ్చితమైన పరమచంచలమైన మనోభావ ముండును. ఆసమయమునం దాచరించిన కార్యము లుండును. అవి ఇదమిత్థమని రూపుకట్టవు. ఆ ఇదమిత్థ మేర్పఱుప రానిది. నిశ్చితమైన రూపము లేనిది. చెప్పఁబడుట కష్టము. భవభూతివంటి మహాకవి వానిని చమత్కారముగా చెప్పును. మహాకవుల మహాశక్తిలో నది యొక విషయము. అట్టి కించిత్ప్రయత్నము ఈకవియందుకూడ కలదు.

"అది యనివార్యమై తపను నానతియై పెఱదారి కింత పీ
లోదవని యేముహూర్తముననో జరిగెన్"

ఈమాటలు కుంతి కర్ణుని అనునయించుటకు చెప్పినవి. తాను చేసిన పనిని సమ ర్థించుకొనుటకు చెప్పినవి. ఈసమర్థనము అప్పటి యనిశ్చితమైన చంచలపరిస్థితికి రూప మొదవించుటకు చేసిన శబ్దప్రయత్నము.

ఈ కృతికర్తయు ఈ కృతిభర్తయు నిద్దఱును దిగంతస్సీమలు అనియే వాడిరి. దిగంతస్సీమకు బదులు అంతస్సీమయు బాగుగానే యున్నది. తప్పు లేదు. అర్థముకూడ విచారరమణీయముగానే యున్నది.

"పూచీ" "అసరా" మొదలైన మాటలు ఇట్టి సుకవితకు పనికిరావు. 'తలతిక్క' 'మీసాలు దువ్వట' ఇట్టివి యాసమాటలు. సత్కవితయొక్క ఉదాత్తలక్షణమును కొద్దిగా భంగించవని చెప్పుటకు వీలు లేదు.

కావ్యము కుంతి చేసిన సంబోధములతో ముగిసినది. శుభావసానము చేయుటలో నిదియు నొక చిన్న శిల్పపునేర్పు.

బెజవాడ,
3—9—50, } విశ్వనాథ సత్యనారాయణ.

# అభిప్రాయములు




C. R. REDDY
*Pro-Chancellor*

*Tel. Add: Prochancellor*
*Tel. No. 885*

West Lake
Yelwal Road
MYSORE

11th August 1950.

My Dear Ramakrishna Sastry Garu,

I have read through your Kunthi. It is a very fine poem dealing with one of the great and complex characters in the Mahabharata. I congratulate you on your success. Your interpretation of the checkered life of Kunthi is bound to appeal to the Andhra public.

## మహాకవి, గడియారం వెంకటశేషశాస్త్రిగారు,

### "శివభారత" గ్రంథకర్తలు, ప్రొద్దుటూరు.

తమ 'కుంతి' కావ్యము కుతూహలముతోఁ జదివితిని. తమ కివే నాయభినందనములు.

ఇటీవలి నవ్యరచనలలో నిదియొక క్రొత్తపోకడ. కథాసంవిధానము, సన్నివేశ సౌందర్యము, వర్ణనావైదగ్ధ్యము, ఇత్యాదు లిందుండవు. ఉండవనగా వానికై ప్రయత్నము లేదు. దానియవసరము లేదు. లేదను కొఱతలేకుండ ఉన్నప్పటి బరువు రాకుండ సౌకుమార్యసుందరముగ హృదయావిష్కారముచేయుటే యిందలి తీర్పునేర్పు. ఈప్రయత్నమునఁ దమలేఖిని చాలవఱకు కృతకృత్య మైనదనియే నాసంతోషము. ఇందు తమ ప్రతిభావ్యుత్పత్తులకుఁదోడు కథావస్తువుకూడ సుపరిచితభారతకథాంతర్గతమేయగుట మీ రచన సరళము సరసము నగుట కెంతో యుపకరించినది. ఉచితసంవిధానచాతురి కిది యొక తార్కాణము.

దూర్వాసుని పరిచర్యమొదలు మహాప్రస్థానమువఱకుగల జీవిత ముఖ్యరంగములలో కుంతీదేవి హృదయమును గన్నులయెదుట నిలుపుచున్నారు. ఇది వర్ణలేఖాంకనములేని యూహాచిత్రణము. ఎన్నడో యుగాంతరమున నంతరించిన కుంతీదేవిచే ఆనాటి యామె హృదయానుభూతి నీనాటికంఠమునఁ బలికించినపుడు కవికి ఔచిత్యమున నే కాగ్రత కత్తివాఁదరపై నడకవంటిది కాకపోదు. మఱియు స్త్రీజీవితోత్తమాశయములఁగూర్చి కాలగతిలో క్రొత్తరేఖలు పొడసూపు నీరోజులలో ఆయుత్తమాశయముల గుఱించి కుంతీదేవిచరిత్ర పరీక్షాప్రశ్నపత్ర మనదగియుండును. ఈయుగసంధ్యలో అందునను స్త్రీజీవితములో ఇహపరములకు, ధర్మకర్మములకు, ప్రేమకామములకు, లోకతంత్ర హృదయధర్మములకు సమన్వయముగూర్చి సారము తేల్చుట తేలికపని కాదు. ఇంతటి సాహసమునకుఁ జేయివేసినను మీలేఖిని కుంతీహృదయము పసిపట్టుటలో అచ్చుకట్టుటలో కరగిపోయుటలో కళలుదీయుటలో ఎందును డిందుపడలేదనియే— ఛాయాగ్రహణ యంత్రముకంటె సున్నితముగా సుందరముగా రూపొందించినదనియే నానమ్మకము,

కుంతీదేవి వ్యాసుని ప్రార్థించునప్పుడు భారతాఖ్యానమున-

"ననుం జిత్రించు ఘట్టమ్ములన్
మామా ! యించుక సంశయింపక యధర్మంబే నిరూపింపుఁడీ !"

అనియు,

"దీనిని ధర్మబద్ధముగ దిద్దుటకై ఎవ రెన్ని రీతులన్
వ్రాసిన లాభ మేమి?"

అనియు నామెచేతనే పలికించి ఆమాట లామె యావేదనానిర్వేదములఁ దొరలి నట్లు స్ఫురింపఁజేయుచు

"తాలిమి మంచిచెడ్డల యథాతథముం గుఱుతించువారు స
చ్ఛీలురు మిమ్ముబోంట్లు వినుతింతురుగాక"

యని యామెనోటనే యొకయూఱటమాట వెడలించి కుంతీశీలమునకొక ప్రాణప్రతిష్ఠయు భారతప్రతిష్ఠకొక యమృతాభిషేకమును జేయించితిరి. కృతినిర్వహణమునఁ బ్రారంభఫలాగమము లిట్లు సుసంగతములు చేయు మీసాహితీసమ్యగ్దృష్టి తప్పక రసికామోదము నందఁగలదు.

ఉభయస్కంధములలో నుభయభాషాసారసర్వస్వ మాకళించుకొన్న మీయనర్గళధారలో నాలంకారికసామగ్రి పూవులు విచ్చి తేనెలు గురియుచున్నట్లుండును. జాతీయములు పలుకుబళ్లు నానుడులు మున్నగాఁ దెనుఁగునందచందములు మీరచనలో గుత్తముగా హత్తుకొనుటలో సహజత్వము స్పృహణీయశోభావహమని చదువరులు గుర్తింపఁగలరు.

పరశ్శతముగా మీవంటి యువకకవుల సాహితీసపర్యల కెదురుచూచుచున్న యాంధ్రభారతికి మీ రితోధికముగ ననర్ఘ కావ్యకుసుమోపహారము లర్పింపఁగలరని యాసించుచున్నాను.

భగవానుఁ డనుగ్రహించుఁగాక.

ఇట్లు

గడియారము వెంకటశేషశాస్త్రి,
శతావధాని.

ప్రొద్దుటూరు,
5-9-50.

## శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు,

ఆంధ్రవిశ్వవిద్యాలయము, వాల్తేరు,

18-10-50

ఆర్యా, వందనములు.

మీరు పంపిన 'కుంతి' యను మీకావ్యమును కృతజ్ఞతతోఁ గైకొని శ్రద్ధనై సాంతముగా చదివి చాలసంతోషించితిని. అందలి భావగాంభీర్యమును శైలీరామణీయకమును ఎంతో ప్రశంసార్హములుగా నున్నవి. కథాకథనములో మీ రవలంబించిన నాటకీయపద్ధతి అతినిపుణముగా నిర్వహింపఁబడినది. ఈపద్ధతివలననే కుంతి చిత్తవృత్తిలో దశాంతరముల సంభవించిన వివర్తములను చక్కఁగా నిరూపింపఁగలిగితిరి. మీకు నా అభినందనములు.

పింగళి లక్ష్మీకాంతం.

---

## నిడుదవోలు వెంకటరావుగారు, ఎం. ఎ.,

మదరాసు విశ్వవిద్యాలయాంధ్రభాషాశాఖాధ్యక్షులు,

6-10-50.

.........పంచమవేదమగు భారతమున పాండురాజపత్నియగు కుంతి యుదంతము రసవంతముగ సంతరించిన కావ్యప్రణేతలు, గొట్టుముక్కలవారు "కవితాబాలకు క్రొత్తయందముల సింగారించు" చతురులు. అవధానవిద్యయందు ప్రౌఢధీశక్తి లుల్లసిల్ల నాతి తేటిన విద్వాంసులు. కృతిపతి కళాపోషకవిశ్వైకవిఖ్యాతంబై తగు రెడ్డివంశమున విద్యాజ్ఞానసౌశీల్యసుస్ఫీతప్రాభవ మొప్ప జన్మించిన కవిమిత్రుఁడు, కళారసికుఁడు, విజ్ఞులకు వేల్పుగిడ్డియనగు కట్టి చినవెంకటరెడ్డి. ఇట్టి వదాన్యశిఖామణి కృతిపతి యగుట బంగరునకు పరిమళ మబ్బినట్లున్నది. అమృతరసతుల్యమగు నాంధ్రభాషలో కవితామృతసిద్ధి వడసిన కవి రచించిన దగుటచేత కృతిపతి తాతముత్తాతల పావనాత్మ లమృతత్వముఁ గాంచుటలో నాశ్చర్య మేమున్నది? కృతి శుభవర్ధనమే గాక సురుచిరాంధ్ర సాహితీ సంవర్ధనము.

పేరునకు కుంతిదైనను కథాసూత్ర మంతయు కర్ణుని వృత్తాంతమే. అది వ్యాసుఁడు చెప్పినట్లు గాక కుంతి చెప్పుటయే యిందలివిశేషము. అందునను తన మనోభావములను వ్యక్తీకరించుచు కథాంశముల నన్నిటిని మన కన్నులకుఁ గట్టినట్లు ఎదలను దాఁకునట్లు కుంతి యెంతయు నేర్పుతో నీకథ విస్తరించినది. కేవల జననమరణాది సామాన్యజీవిత పరిణామముల నేకరువుపెట్టు చరిత్రవలె గాక భావపరిణామమును మానసికపరివర్తనమును స్పష్టము చేయు రచనాచమత్కృతిచే నీగ్రంథము వెలయుచున్నది. కుంతి యుదంతముగాని కర్ణుని గాథగాని తెలుఁగువారిలోఁ దెలియనివా రెవ్వరుందురు? గతానుగతికముగ వచ్చుచున్న యీపౌరాణికగాథనే మనోభావవిపులీకరణమగు మహావిశిష్టతగల కావ్యముగా దిద్ది తీర్చిన రామకృష్ణశాస్త్రిగా రెంతయు ప్రసంశనీయులు.

నేఁటికాలమునఁ బుంఖానుపుంఖములుగ ఖండకావ్యములు వెలువడినవి, వెలువడుచున్నవి, వెలువడఁగలవు. కాని యిట్టి మానసికపరివర్తనము (Psychological wolution) దెలుపు కావ్యము లంతగా వెలువడలేదనియే నా యభిప్రాయము.

ఈ గ్రంథము పూర్వోత్తరఖండములుగా విభజింపఁబడినది. ఇందు పదునాఱు శీర్షికలు కలవు. భారతము పదునెనిమిది పర్వములలో భీష్మద్రోణపర్వములు విడిచిన కర్ణునికథతో నీ పదునాఱుశీర్షికలును తక్కిన పదునాఱుపర్వములు నతుకును కాబట్టి కవి యిందెంతయు కల్పనాచాతుర్యము కథాసమన్వయపరిజ్ఞానముఁ బ్రకటించె నని చెప్పక తప్పదు.

ఇందలి పాత్రపోషణ మెంతయు సముచితమై యున్నది. 'హృదయస్ఫులింగ' మను శీర్షికలో మాతృప్రేమ చక్కఁగ నిరూపిత మైనది. అందలి భావములు నిజముగా హృదయస్ఫులింగములే.

"నీ తలిదండ్రు లెవ్వ రని నీ కుల మే మని యెవ్వ రేని ని
ర్హేతుకమైన ప్రశ్న వెలయించిననాఁడు నిరుత్తరుండవై
కాతరభావ మేర్పడ మొగంబున విన్నఁదనంబు దోఁప నే
రీతిఁగ నశ్రువుల్ నిలువరింతువురా దురదృష్టబాలకా ?"

అని యశ్రువులు నిలువరించి హృదయమున నొకమూల నిదుఃఖభారమును సహించుచు కుంతి క్రమక్రమముగా పాండుభూపతివలన పాండవులను కని వారి యభివృద్ధిం గాంచి కొన్నిఘట్టములయందు కర్ణజననీస్మృతి తళుక్కున మెఱపుమెఱసినట్లగుచు కర్ణప్రాభవముతోఁగూడ తనజీవితయాత్ర సాగించుచు తుదకు

"నైజకవచస్ఫురితుండును దివ్యకుండల
శ్రీలలితుండు శాంతిమధురీకృతహాసుఁడు కర్ణుఁ డల్ల దే
బాలదినేశమండలముభాతిని మీకరుణాస్రవంతిలోఁ
దేలుటఁ జూచుకొంటి"

నని తన క్లిష్టజీవితాధ్యాయము ముగించెను. ఇంతకుఁ గర్మసాక్షియగు సూర్యుఁడే కుంతికి సాక్షి. ఇక నీ జీవితనాటకమును వ్యాసుఁ డెట్లాడించిన నేమి. ఈకావ్యమున పైఘట్టము లన్నియు నతిమనోహరముగఁ జిత్రితములైనవి.

ఇందలి శైలి ధారాళమై సుగమమై స్వచ్ఛమగు సెలయేటినీటివలె ప్రవహించుచున్నది. జాతీయము లిందు కొల్లలు. "నీకు నొక పూచీ లేదా యీబిడ్డపై" "తనయుల కోస మంచు సరదా పడి" "ఈ తెరవెన్క భాగవతము" "ఇంటివో అసలు లేవో!" "పుణ్యాత్ముల నందితిన్" "ఛీ! యని తిట్టిన కుదురనితిక్క" "అమ్మా! బిచ్చ మన్నట్టు" ఇట్టివి ప్రతిపద్యమునందును గనుపట్టును. కావ్యమునం దచటచట నంధ్రతాముద్ర యచ్చువబోసినట్లున్నది. చంపకోత్పలములు శార్దూలమత్తేభములే యున్నను సత్కవితామృతము జవిచూపుచున్నవి.

భావప్రధానములైన నేటికావ్యములలో సాధారణముగ నిర్దుష్టమగు రచన కనుపట్టుట లేదు. ఇం దట్టిరచనారీతి యుండుట యెంతయు నభినందింపఁదగినది.

కేవల వస్తుప్రధానములు వర్ణనాప్రధానములు భావప్రధానములు నగు కావ్యములకన్న కథాభావసమ్మిళితములైన కుంతివంటి కావ్యములు కర మాదరణీయములు. శృంగారభావములకుఁ జోటీయని యిట్టిరచనలు విశ్వవిద్యాలయములలో ప్రథమశాస్త్రపరీక్ష, పట్టపరీక్ష మొదలగువానికి పఠనీయగ్రంథములుగా నిర్ణయించిన దేశభాషాభ్యుదయము చెంపొందును. ప్రాతకథనే నూతనరీతులతో

క్రొత్త ప్రాతల మేలికలయిక
క్రొమ్మెఱుంగుల చిమ్మగా,

నిట్టి యుత్తమకావ్యరచన గావించిన రామకృష్ణశాస్త్రిగారిని సర్వదా సర్వథా యభినందించుచున్నాఁడను. ఈ సత్కృతిని యాంధ్రవిద్వల్లోక మాదరించుఁగావుత మని యాశించుచున్నాఁడను.

నిడుదవోలు వెంకటరావు, ఎమ్. ఎ.,

---

## శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం, ఎమ్. ఏ, గారు,

ఆంధ్రశాఖాధ్యక్షులు, ఉస్మానియాయూనివర్సిటీ, హైదరాబాదు (దక్కను)

18 సెప్టెంబరు 1950

శ్రీ గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రిగారు రచించిన కుంతీ కావ్యమును చదివి యానందించితిని. వారిరిపుట్టురత్నములైన ఆద్యసత్కథలను సమకాలరుచుల కనుగుణముగా తీర్చి దిద్దుట యొక సారస్వతరీతి. దీనినే రామరాజభూషణుడు మిశ్రకావ్య మనెను. అతనినాఁటి మిశ్రకథారచన యనఁగా మహాప్రబంధనిర్మాణము. సమగ్రశృంగార రసపోషణము, ఉత్ప్రేక్షాద్యలంకారబాహుళ్యము, ఈనాఁడు ఖండకావ్యనిర్మాణము కరుణరసపోషణము స్వభావోక్తిప్రాచుర్యము. సహృదయహృదయానందజననము. కుంతి కావ్యరచన సరిగా ఏవంవిధలక్షణలక్షితము.

కావ్యము జీవితవిమర్శనముగా నుండఁదగునని నేఁడు విమర్శకులేగాక కవులును అంగీకరించుచున్నారు. కుంతికావ్యమునందు జీవితపరామర్శ నిపుణముగను వ్యంగ్యముగను జేయఁబడినదని సహృదయులు గుర్తింతురు.

కుంతీదేవి చరిత్రము ధర్మబద్ధ మగునో కాదో ఎవ్వరును ఎన్నటికిని సర్వజనాంగీకారముగ నిరూపింపఁజాలరు. ఈభావమునే కవిగారు, "దీనిని ధర్మబద్ధముగ దిద్దుటకై

యొవ రెన్నిరీతులన్, బూనిన లాభ మేమి?" అని సముచితముగఁ బల్కినారు. కాని ఒకటి రెండు స్థలములలో వీరి కుంతీపాత్రపోషణము నాకు నచ్చలేదు. సంతానప్రాప్తికై చింతించుచున్న పాండురాజుతో దేవతాప్రసాదమున పుత్రోత్పాదనము చేయఁగల్గుదానని కుంతి స్వయముగ చెప్పికొనుట స్త్రీస్వభావవిరుద్ధము. ఈఘట్టమున పింగళి సూర నార్యుఁడు రాఘవపాండవీయమున చేసిన రచన ఔచిత్యపోషకమై యున్నది.

"ఎనయన్ లోకగురుప్రశస్తికల నీ యిల్లాలనై" ఆశ్వా. 49 ప. ఇదియే మహా భారతమందలి విధముకూడ— పుత్రులను బడయుమని మాద్రిని కుంతి స్వయముగా ప్రబోధించినట్లు కవిగారు చేసిన కల్పన, మహాభారతవిరుద్ధమైనది. ఈమార్పువలన కుంతి పాత్రపోషణకు ఉత్కర్ష కలిగినట్లు నాకు తోఁచదు. ఈపట్టులు విడిచి తదితరములందెల్ల కుంతీస్వభావచిత్రణము శుద్ధమై గంభీరమై క్షాత్రదీప్తిప్రదర్శకమై కరుణరసపరిప్లుతమై యున్నది. కుంతి తనకుమారుల కిచ్చిన సందేశము భారతవీరమాత తనబిడ్డల కీయదగిన యుత్తమాదేశము.

ఈకావ్యశైలి రమ్యమై ప్రసాదగుణము కలిగి ద్రాక్షాపాకమున నొప్పారుచున్నది. నన్నయభట్టారకుని జన్మచే పునీతమైన వేగిమండలపుకవులకు తఱుచుగా అమహనీయుని తత్సమపదబహుళమును మృదుసమాసగుంఫితమును నగుశైలి వారసత్వముగ సిద్ధించినట్లు తోఁచును. ఆధునికకవులలో శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారును శ్రీ వేదుల సత్యనారా యణశాస్త్రిగారును ఈరీతికి ప్రవర్తకులు. శ్రీ రామకృష్ణశాస్త్రిగారి శైలికూడ ఇట్టి పాకమునఁ బడినది. కావ్యమంతయు ఏకపాత్రస్వగతసంభాషణముగా నుండుట దీనియం దలి మఱియొక విశేషము. ఇట్టికావ్యము చిన్నకుసుమమైనను బహుళామోదభరితమై సాహిత్యోద్యానమున నందగించఁగలదు.

ఖండవల్లి లక్ష్మీరంజనం, ఎం. ఏ.

**S. TULASIDAS NAIDU, B. A., B. L.,**
(Subordinate Judge Retd.)
Arbitrator, Town Planning Schemes,
City of Mâdras—58 Edward Elliots Road,
Mylapur, MADRAS, 6-11-1950.

శ్రీ 'అవధానిశేఖర' గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రిగారిచే రచింపఁబడిన 'కుంతి' కావ్యము నామూలాగ్రముగా పఠించుభాగ్యము కలిగినది. కవిత్వము అతిమనోహరముగా నున్నది. శైలి కడుంగడు సులభముగా నున్నది. పద్యములు మధురాతిమధురములై ద్రాక్షాపాకమున నున్నవి. పరమపతివ్రతయగు కుంతీదేవి మాతృహృదయము వెల్లడించు పట్ల కవితల్లజుఁడు చూపిన చాతుర్య మనన్యసామాన్యమైనది.

"హృదయము గొన్న బిడ్డ యెట కేగెనొ, ఎట్టియవస్థ నుండెనో వెదకుచు రేవగల్లు విలపించుచు చావఁగలేక యెట్టులో బ్రదుకుచు" న్న కుంతీదేవి హృదయతాపము చక్కఁగా చిత్రింపఁబడినది. సహజమాతృప్రేమను బహిర్గతము చేయుటలో అవధాని శేఖరులు అప్రతిమానప్రతిభాప్రజ్ఞలు చూపిరనుటలో నతిశయోక్తి యెంతమాత్రమును లేదు. మచ్చునకు మూఁడుపద్దెముల నిర్దేశింతును.

"తనయులకోస మంచు సరదా పడి" 3 పే.

"ఆకర్ణోజ్వలనైజకుండయుగంబు" 8 పే.

"కులగోత్రంబు లెఱుంగరాని" 8 పే.

అస్త్రపరీక్షయం దవకాశము లభింపక కర్ణుఁడు తిరస్కృతుఁడైనప్పుడు కుంతీదేవి వెలిబుచ్చిన భావపరంపరను కవిశేఖరులు ,ఈక్రిందిపద్యములలో చక్కఁగా నిరూపించిరి.

"ఆసుకుమారమూర్తిఁ గనినంతనె" 21 పే.

"వాఁ డెవఁ డద్దిరా! ఉదయభాస్కర తేజుఁడు" ,,

"జరిగినదాని కింతయు విచారము నందకుమయ్య!" 23 పే.

నదీప్రవాహమునఁ గర్ణుని గిరవాటుపెట్టిన విషాదసంఘటన కుంతీదేవిని ఆజన్మాంతము దుఃఖభాజనురాలిగాఁ జేసినది. అశాంతివహ్ని యామెను దహించివైచినది. ఆమె హృదయావేదనను 'విఫలానునయము' అను శీర్షికలో కవివతంసులు జాలికలిగించు పద్యములతో చిత్రించిరి.

"ఏను విపన్న నౌచు నెటు లేడ్చితినో" 34 పే.

"అక్కజమైన మాతృహృదయంబు" 36 పే.

కర్ణుఁడు రణరంగమున కూలినప్పుడు కుంతీదేవి విషాదప్రకటనము చదువరుల హృదయము కరఁగించును.

"అవులే నామతి మండిపోను!"

కుంతీదేవి పశ్చాత్తాపమునకు మేరయే లేదు.

"ఊరక గూండ్లు కట్టుకొని యున్నవి బెంగలు" 46 పే.

ఆసతీలలామ తత్పదం బభిలషించుచు నిత్యశాంతిధామాన్వేషణసంకల్పముతో ధ్యానమగ్నురాలైనప్పుడు.

"కనులన్ మూయుచు" 46 పే.

మున్నగుపద్యములలోనిభావన ప్రతిభాద్యోతకముగా నున్నది. నిర్వాణమునందలి

"ఈ యానందము తీరిపోవుటకు మున్నే" 48 పే.

అను గభీరతరమైన పద్యరాజముతో కావ్యము విషాదాంతముగా పరిసమాప్తమైనది.

కుంతీదేవి ఆజన్మాంతము కష్టపరంపరలకు లోనైనది. ఎన్నికష్టములలోనైనను ఆమె నైజక్షాత్రభావమును వీడలేదు. ఆమెతపస్సునకు మెచ్చి భగవానుఁడు వరము కోరుమన్నప్పుడు "కష్టములలోనే మిమ్ము ధ్యానించు భాగ్యము కలుగును. కావున కష్టపరంపరనే యనుగ్రహింపుఁడు" అని యామె స్వయముగా కష్టములనే వరించెనని యొకగాథ కలదు. ఆగాథయును కావ్యములో చేర్చిన కుంతీదేవిచరిత్ర సంపూర్ణము కాగలదు. నిజమునకు ఈ కష్టములు ఈ దుఃఖములు ఆమెకు వైకుంఠధామసోపానము లైనవి.

ఈకావ్యమున పదలాలిత్యము అర్థగౌరవము అత్యంతనైపుణ్యముగా చూపఁబడినవి. లోకోక్తులు సందర్భానుకూలముగా నుపయోగింపఁబడినవి. సామాన్యపదములు సైతము రసభరితము లైనవి. ఆధునికశబ్దప్రయోగములు సమకాలికచరిత్రను సూచించుచున్నవి. "భారతభావిభాగ్యము" "భారతపునర్నిర్మాణభాగ్యము" అను వాక్యములు వర్తమాన భారతచరిత్రకు అన్వయించుచున్నవి.

కుంతీదేవి పవిత్రభావములు విశాలహృదయముతో చిత్రింపఁబడినవి. ఆదర్శజీవిత ధర్మములతో నీచిన్నికావ్యము నిండియున్నది.

ప్రౌఢభారతీసదనసభ్యులగు శ్రీ శాస్త్రిగారు తమసదనమునకే గాక ఆంధ్ర కవిత్వమునకే వన్నెఁ దెచ్చినవారని చెప్పవచ్చును.

ఈకావ్యము ఆమూల్యమ్ముగ నాశశాంకముగ విఖ్యాతిఁ గని ఆంధ్రభాషాభూషణమై వెలయఁగలదు. ఇంకను ఉత్తమకావ్యముల రచించుటకు కవివతంసులు భాస్కర ప్రేరితు లగుదురుగాక.

కవిభాస్కరుఁ డని చెప్పఁదగిన కృతిపతి మదీయమిత్రరత్నము "కవిసుధాకర" కట్టి చినవెంకటరెడ్డిగారు భాస్కరప్రేమాంకూరమైన కర్ణుని దివ్యచారిత్రమును తమ మధురకవితాసుధారసముచే నింపి మనోహరప్రబంధరూపమున ఆంధ్రదేశమున కచిర కాలముననే అందించి ధన్యు లగుదురుగాక.

సురభి తులసీదాసు.

---

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు,

ఆంధ్రవిశ్వవిద్యాలయకళాశాలా ప్రధానాంధ్రపండితులు, (Retd)

ధవళేశ్వరము. 8-8-1950

శ్రీ గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రిగారు రచియించిన 'కుంతి' యను ఖండ కావ్యమును సాంతముగాఁ జదివితిని. కథ విఖ్యాతమే కాని రచనరీతి నవ్యము. పూర్వ కవిత్వమునకు నేఁటికవితకు సామరస్యముఁ గలిగించుచున్న వర్ణనలు హృద్యములు.

జాతీయపదప్రయోగమున వినా నింపైన కవితాధార యనర్గళము. కథాప్రవృత్తి భారతము ననుసరించినదయ్యు స్వతంత్రముగాఁ గనవచ్చుట యీరచనలోని విశేషము. ఆమహాభారతములోఁ గనఁబడీకనఁబడకుండఁగా నున్న కుంతి యొందు వివేకము కార్యదీక్ష రాజనీతి చాతుర్యము నావిష్కరించుచుఁ బాఠకులకుఁ బ్రత్యక్షమగుట మఱియొక విశేషము. నేఁటి కావ్యములో నుత్తమమని గణింపఁదగిన కావ్యములలో నిది యొకటి. ఈకృతిని రచించిన కవియు దీనిని గ్రహించిన కృతిపతియు ధన్యులైరి.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

---

శ్రీ వినాా అప్పారావుగారు,

ఆంధ్రవిశ్వవిద్యాలయకళాశాలాధ్యక్షులు (Retd)

గుంటూరు. 5—8—50

నేను తమపుస్తకమును చదివినాను. ఘట్టములు రసవంతముగా నున్నవి. కవిత్వము ద్రాక్షాపాకముగా తోచినది.

వినాా అప్పారావు.

---

ఉభయభాషాప్రవీణ శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు,

ఆంధ్రపండితులు.

రామచంద్రపురం 19-9-1950

మీ కుంతి చదివాను. ఒక్కొక్క ఘట్టం కన్నీళ్లదాకా కదలించింది.

భవదీయుడు,

హనుమచ్ఛాస్త్రి

---

శ్రీ గార్లపాటి రాఘవరెడ్డిగారు.
'కాకతీయ' పత్రికా కార్యాలయము, అనుమకొండ.
వరంగల్, 28-11-50.

భావవిలాససంపదయు, భాసురశయ్యయు, ప్రౌఢలక్షణ
శ్రీ వెలయంగ మీరు విరచించిన 'కుంతి' బుధప్రపంచసం
భావిత మేల కాదు ? ప్రతిపద్యరసోదయమై వెలుంగు
నోకోవిదచంద్ర! మీకవితకున్ కొదవల్ కలవే తలంపఁగన్?
తనకృత్యమ్మును వెల్లడింపఁగ మదిన్ ధైర్యంబు లేకున్కి పు
త్రుని నట్టేటను ద్రోసిపుచ్చుటకు చేతుల్ రాక తా నెంతవే
దనపాలయ్యెనొ కుంతి యెక్కరణి బాధన్ దూలెనో త్రోలఁగ
న్గానినట్లె పరితాపనీరధిని మున్గున్ విన్నవాఁ డెంతయున్.
మీకవితాక్షేత్రంబున
నీకరణి ననేకకృతులు నింపొలయించున్
గాక దిశావలయమ్ములఁ
బ్రాకుత నీకీర్తిలతిక పాండిత్యనిధీ !॥

గార్లపాటి రాఘవరెడ్డి.

---

మధురకవితావిశారద. వై. వేంకటరమణగారు, ఎం. ఎ. బి. ఇ.డి.,
లెక్చరర్. పి. ఆర్. కాలేజి, కాకినాడ. 8-12-50.

కంతుల్ గట్టెను నాటిసంఘునియమాఘాతంబులన్ మాన్యయౌ
కుంతీదేవియశశ్శరీరము; మహాక్షోభాన్వితం బైన పృ

త్తాంతమ్మున్ హృదయంగమం బయిన సత్కావ్యమ్ముగాఁ గూర్చి, తా
ద్యంతంబున్ మధురంబుగా సహృదయాహ్లాదంబుగా మిత్రమా!

కుంతిరచనమ్ముచే పదగుంఫనమున
భావమాధుర్యమున రసబంధురతను
రామకృష్ణకవీంద్రు "నారసుఁడ" వంచు
కీర్తి గడియింతు వోరామకృష్ణసుకవి!

ఆంధ్రభారతి నర్చించు నాశతోడ
ప్రౌఢభారతీసదన మేర్పడియె నందు
విరిసె నింకొక్కపూవు తత్పరిమళమ్ము
తెలుఁగుకవిలోక మంతయు నలముకొనుత.

వై. వేంకటరమణ, ప్రౌఢభారతీసదనము.

---

సహజకవితావిలాస, నిమ్మకాయల సుబ్బారావుగారు,
ప్రౌఢభారతీసదనము, కాకినాడ. 8-12-50.

సదమలకావ్యకన్యకయు సర్వగుణాన్విత ప్రౌఢభారతీ
సదనపుముద్దుబిడ్డ యగు సత్కృతి కుంతిని సంతరించి నీ
పదనగు నవ్యలేఖిని కుపక్రమణంబున మాతృదేవతా
హృదయము దన్పినాఁడవు సుహృద్వరుఁడా! అవధానిశేఖరా!

నిమ్మకాయల సుబ్బారావు.

---

కవిమూర్ధన్య, కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు.

తుల్యారామేశ్వరము, కాకినాడతాలూకా, 9–8–1950.

ఓ యవధానిశేఖర ! యనుత్తమమిత్రమ ! రామకృష్ణశా
స్త్రీ ! యసమానకావ్యము సృజించిన నీధిషణావిశేష మె
ట్లోయి నుతింప నేర్తుము ? రసోచితఘట్టములెల్ల నాదుక
న్గోయికిఁ గట్టినట్టులుగఁ దోఁచుచు నన్నెడఁబాయ వింతకున్.

భారతసత్కవిత్రయము పట్టిన గంటపువాడిముమ్మొనల్
జేరిచి హారివైఖరి రచించిన లేఖినిఁ జేతఁ బూని కుం
తీరమణీయనూతనకృతిన్ రవళించితి వట్లు కానిచో
నేరికినైనఁ బట్టువడునే ధర నిట్టిరసప్రచారముల్ ?

కృతిపతియున్ రసజ్ఞుఁడు కవీంద్రుఁడు సత్కవనావనైకదీ
క్షితమతి, కర్తయున్ నిరవశేషసుధీసమధీతశాస్త్రసం
హతి, వితతాయురాగమరహస్యకలానిధి, చెప్ప నేల యీ
కృతిగతసుప్రశస్తి, వెల నెట్టులు కట్టఁగ నౌను దీనికిన్ ?

ఒకవాక్యమ్మున బాహిరించెదను నాయూహన్, భవత్కావ్యపా
ఠకులౌ సత్కవులెల్లరున్ సహజరూపంబౌ స్వభావంబు మే
రకు కాంతాళమొ మోదమో పడయువారల్ గాని తాత్త్రీయభా
వకనన్మానసు లౌట కల్ల యని నే వాకొందు నుచ్చైరుతిన్.

కాకరపర్తి కృష్ణశాస్త్రి.

# విన్నపము.

ఈ కావ్యము నాలుగైదేండ్లకు మున్నే ప్రకటితము కావలసి యుండెను. కాని కవిలోకసామాన్యమగు ఆర్థికదుస్థితి అడుగడుగునను అవరోధమై నిలుచుచుండెడిది. పైఁగా కాగితముల కంట్రోలొకటి "కొఱకరానికొయ్య" యైనది. నేఁటికైన దీని నిట్లు లోకమునెదుట నుంచఁగలిగిన నా భాగ్యమునకు రూపనిర్ణేతలు మా కృతిపతులు.

ఎడనెడ మహాభారతము చదువుచున్నప్పుడు సర్వసన్నివేశముల యందును విశిష్టరూపమున గోచరించిన కుంతియొక్క స్వరూపస్వభావములను ఛాయామాత్రముగనైన చిత్రించుటకుఁ దలపెట్టిన ప్రయత్నసాహసమునకు ప్రతిరూప మీకావ్యము. దీన నెంతవఱకు కృతార్థుఁడనైతినో సహృదయులు గుర్తింతురు.

అల్పజ్ఞుఁడనగు నాపై వాత్సల్యము మెఱయ పీఠికను పరిచయమును అభిప్రాయములను వ్రాసి పంపిన ఆ యా విద్వత్కవిశిఖామణులకు నా కృతజ్ఞతా వందనములు.

ఈ కావ్యరచనకైన నెంతయు ప్రోత్సహించిన స్నిగ్ధహృదయులగు ప్రియమిత్రులు 'కవిమూర్ధన్య' శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారికిని, ప్రియసోదరులు శ్రీ సురభి నరసింహం, B. A., B. Ed, గారికిని నా ప్రణామములు.

సర్వాంగసుందరముగా నీకావ్యము నిట్లు ముద్రించిన 'శ్రీపతి ప్రెస్' వారికి నా యభివందనములు.

నడకుదురు,
వికృతి, మాఘపూర్ణిమ.

గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి.

# కృతికర్త



అవధానిశేఖర - ఆయుర్వేదాలంకార

ఆయుర్వేదాచార్య,

గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి

(ప్రౌఢభారతీసదససభ్యులు)

అరుణాశ్రమము

నడకుదురు (Via) కాకినాడ

# సంప్రార్థనము

శ్రీమత్త్వావకపాదపద్మయుగమున్
చిత్తమ్మున న్నిల్పి త
త్సామర్థ్యమ్మున నేడు కావ్యరచనల్
సాగించితిఁ గావునన్
ధీమంతుల్ గుణదోషముల్ వెదకి ని
ర్దేశించునాఁ డో రఘు
స్వామీ! యుత్తరవాది వీవ సుమి య
స్మన్నవ్యకావ్యమ్మునన్.

*　*　*　*

ఊరక చీఁకటింటఁ బడి
యున్న జడు న్నను మేలుకొల్పి వి
స్తారభవత్కృపావిలసి
తం బగు మామకజిహ్వికాస్థలిన్
గూరిమి నిల్పి కబ్బములఁ
గూర్చితి వమ్మరో! కానిచో నధీ
కారము పీని కెక్కడిది
కావ్యములన్ లిఖియింప భారతీ?

# కృతి

శ్రీరమణీయమూర్తి ! గుణశేవధి ! దాతృశిఖామణీ ! కళా
వీరవరేణ్య ! "కట్టి చినవేంకటరెడ్డి !" ముదంబుమీఱ నన్
గోరితి వొక్కనాఁడు "బుధకుంజర ! నీకృతి నొందు నాకుఁగాఁ
గూరిమి ని" మ్మఁటంచు, నిదిగో కొను మిచ్చితి నాకృతిం గృతీ !

తెలుఁగుందేశముఁ గావ్యకన్యకకుఁ దృప్తిన్ బుట్టినిల్ జేసి యు
జ్జ్వలతద్దివ్యకళాకలాపముల నాశావీథులన్ బండువె
న్నెలల న్నింపినసార్వభౌములు యశోనిస్తంద్రు లౌ రెడ్డిరా
జుల నగ్గింపక కావ్యసంగ్రహణముల్ శోభించునే యిద్ధరన్ ?

ఏతాదృగ్విభవాభిరామము కళాహేవాకవిశ్వైకవి
ఖ్యాతం బై తగు రెడ్డివంశమున విద్యాజ్ఞానసౌశీల్యసు
స్థితప్రాభవ మొప్పఁ బుట్టి కవితాసిద్ధుండ వై మించు నీ
కే తత్కావ్య ముపాయనం బొసఁగ నే నెంతేని గర్వించెదన్.

నీతలిదండ్రు లార్యపథనిష్ఠితు లున్నతదానవైభవో
పేతులు "సుబ్బమాంబయును వేంకటరెడ్డి," తరింపఁ దాతము
త్తాతలపావనాత్మ లమృతత్వము నంద సమస్తబాంధవ
వ్రాతము లుత్సహింప శుభవర్ధన మీకృతిఁ గొమ్ము ధీనిధీ !

# కృతి

కవితారీతు లనంతముల్ కవులసంస్కారానుకూలమ్ముగా
నవభాసించుఁ; దదంతరస్ఫుటరసాహ్లాదప్రకారమ్ములున్
వివిధంబుల్; ధర నంద ఱన్నిటను దృప్తిం బొంద- శేయల్పపుం
గవితల్ సైతము నాదరింపఁబడు లోకంబందు నేదోయెడన్.

కావున నాకవిత్వము జగన్నుత మౌ నని కా దనీ వృథా
భావపరంపరారభటిఁ బాఱఁగఁ ద్రోలి నిసర్గసాహితీ
సేవ యొకండె లక్ష్యముగఁ జేసి రచించితి నీకృతిన్ గుణ
శ్రీవరధామ ! రెడ్డికులశేఖర ! వేడ్కఁ బరిగ్రహింపుమా !

అరవిందప్రభుపాదపంకజసపర్యాపూత మై నిత్యశాం
తిరమాధిష్ఠిత మైన నీహృదయవీథిఁ బ్రస్ఫుటీభూతసు
స్థిరరూపమ్మునఁ బ్రౌఢభారతి వసించెఁ; దత్కృపాదృష్టిచేఁ
బరిపుష్టం బగు మామకీనకృతి సంభావ్యంబు నీ కిమ్మెయిన్.

ఏదో మూల నడంగి యున్న నను మున్నీ కావ్యనిర్మాణదీ
క్షాదేశం బొనరించి తత్కృతి ననూనామోద మేపారఁగా
నౌదార్యమ్మున స్వీకరించితివి నీవై; భారతీపాదసే
వాదర్శంబు ఫలించె నీకుఁ గవిమాన్యా ! మిత్రచూడామణీ !

## కృతి

ఈకృతికన్యఁ జేకొనఁగ నెందఱో కావ్యరసజ్ఞు లెంతయున్
ప్రాకటకాంక్షతో నొడువు వైచిరి నాకడఁ; గాని సర్వవి
ద్యాకలితాదరా ! కవిసుధాకర ! యీ మనమైత్రి దీనికిన్
నీకును లంకె వైచినది నేర్పుమెయిన్ ప్రణయాగ్రదూతియై.

ఈకబ్బంబు భవత్కరోపహిత మయ్యెన్ మిత్రమా ! నేడు నా
బాకీ తీఱెను మామకీనకృతి విశ్వవ్యాప్తరూపమ్ముతో
నీకై కొండొకకీర్తిసౌధమును దా నిర్మించు- నద్దాన న
స్తోకాయుర్విభవమ్ముతో ననితరస్ఫూర్తిన్ ప్రకాశింపుమా !

# కృతిపతి



కవిసుధాకర,

కత్తై చినవెంకటరెడ్డిగారు

ప్రౌఢభారతీసదన వ్యవస్థాపకులు

కాకినాడ

# కృతిపతి విజ్ఞప్తి

కవితాబాలకుఁ గ్రొత్తయందముల సింగారించు నీచాతురుల్
అవధానమ్ముల నుల్లసిల్లు భవదీయప్రౌఢధీశక్తులున్
స్తవనీయంబులు రామకృష్ణకవిచంద్రా ! మాటికిన్ మాటికిన్
మిపులన్ న న్గిలిగింత వెట్టి యదియే మీమైత్రిఁ గూర్చెన్ గడున్.

కుంతీనామకచారుకావ్యమును మాకున్ మంగళాశాసనా
త్యంతప్రేమము మీఱ నంకితముగా నర్పించి కల్పాంతప
ర్యంతం బెంతయు మామకీనఘనవంశానూనసత్కీర్తి నా
శాంతస్సీమలఁ బాడుకొల్పితిరి మి మ్మగ్గింతు నశ్రాంతమున్.

ఏపుర మిన్నినాళు లొకఁడే యయి యన్నిటఁ బ్రౌఢభారతీ
పావనపాదసేవన మపారముగాఁ గవితాసుమావళిం
జేవదలిర్ప సల్పితిమి– చే యెటు జాఱవిడంగనిత్తు మా
దేవి యనుగ్రహించినకృతిన్– బరు లెవ్వరు దీనిఁ గైకొనన్ ?

కాకినాడ,
20-7-1950.

ఇట్లు విధేయుఁడు,
**కట్టి చినవేంకటరెడ్డి,**
ప్రౌఢభారతీసదనము,

# పూర్వఖండము — విషయసూచిక.

# చాపల్యము

కృపయో కోపమొ సర్వవేత్త యగు మౌనీంద్రుండు నా కిప్పుడే
యుపదేశించెను మంత్ర మొం డది నిజంబో కాదొ యం చూరకే
జపముం జేసితి నిద్దలంచి యిది యిచ్ఛావృత్తిచేఁ గాదు నా
యపచారమ్మును సైపుమయ్యా ! కనుమయ్యా నాదు కన్యాత్వమున్ !

సంతతికోసమై చిరవిచారమునన్ దపియించు నామె కీ
మంతరముం జపించుకొనుమా యన న్యాయము గాని లోకవృ
త్తాంత మెఱుంగలేని చపలాత్మకు మాదృశబాల కిప్పుడే
మంత మునింగిపోయె నని యామునిచంద్రుఁ డొసంగె నింతకున్ ?

ఇది యన్యాయము భాస్కరా ! మొదట నాదే తప్పు గావచ్చు నీ
పదిరెండేఁడులకన్నె నింత క్షమియింపం జాలవా ? యింక నా
బ్రదుకున్ ఘోరకళంకదూషిత మొనర్పం జూతువా ? జ్ఞానసం
పదకున్ మూలమ వైన నీ కెవరు చెప్ప న్నేర్తు రయ్యా ప్రభూ !

"పొరపాటో మఱి యేమొ నీ విట జపమ్ముం జేసినా వింకఁ ద
ద్వరమంత్రార్థము నిష్ఫలం బయి నశింపం జాలదో బాల ! మ
త్పరిభుక్తం బయి నిష్కలంక మగుఁగాత న్నీదు కన్యాత్వ మీ
వర మే నిచ్చితి భీతి మాను" మని యాశ్వాసింతువా భాస్కరా !

ఏమి మహాప్రభూ ! ఎచటి కేగితి వీనిముసమ్ములోనె నీ
ధామ మొకండు నన్ బులకితన్ బొనరించె ని దేమిచిత్ర మ
య్యో ! మతి లేనిదానికి శిశూదయ మొక్కటియా పరాత్పరా !
ఈ మహిమానుభూతి కిట నేడ్చెదనో మఱి సంతసింతునో ?

ఓయి యభాగ్యసంభవ ! శిశూ ! మరణింపుము వేగ లేనిచో
నాయపచారదుష్ఫల మనంతము నీ కనుభోజ్య మయ్యెడిన్
నాయన ! శైశవంబు నయినన్ విడనాడని నాకుఁ బుట్టి దీ
ర్ఘాయువు నెట్లు పొందుదువురా ! ధరణిం దురదృష్టవంతుఁడా !

ఓ నవముగ్ధమూర్తి ! సుకృతోచితసూర్యసుతుండ వౌటచే
జ్ఞానము విక్రమం బితరసాధ్యము గానియశంబుఁ గొందువే
కాని ధరాస్థలిన్ బ్రదుకఁ గల్గుదినమ్ములలోనఁ దుచ్ఛకా
నీనపదంబు ని న్విడుచునే తలక్రిందు తపంబుఁ జేసినన్ !

నామర్యాద నశించి పోవుట యటుండన్ గర్మసంపత్పరీ
ణామం బై జనియించి నవ్వుకొను నీ నా నెత్తురుంగడ్డ తా
నే మై పోవలె దీనిఁ జంపుకొని నేనే చత్తునా కర్మసా
క్షీ ! మాటాడ వి దేమి నీకు నొకపూచీ లేదా యీబిడ్డపై ?

"దోసం బంట దఁటంచు నే నుడువలేదో నీదుమర్యాదకున్
నాసంతానము బాధ్యతల్ తెలిసికోనా నేను నీ కేటి కా
యాసం బాపసికూనఁ బెట్టె నిడి గంగాంభఃప్రవాహమ్మునన్
ద్రాసం బింతయు లేక వీడు" మని యాజ్ఞాపింతువా నాప్రభూ ?

స్వామి ! కృతార్థురాలను విచారము లే దిఁక నాకు నిప్పుడే
ప్రేమముఁ జంపుకొంటి- నిదె వీడితి నీకరుణాఫలంబు ను
ద్దామతరాంబుగర్భమున- దాని సుఖావసథంబుఁ జేస్తు మ
య్యా మహితప్రభావ ! కొను మయ్య మదీయనమశ్శతమ్ములన్ !

తనయులకోస మంచు "సరదా" పడి యేపెరవారిబిడ్డనో
గొని కడుముద్దుగాఁ బెనుచుకొందు రపుత్రులు- కన్నబిడ్డ న
ర్కునియవతారమున్ గవచకుండలమండితు నిట్లు గంగలో
మునిచిన తల్లి నే నొక తెఁ బుట్టితి నేఁటికి భారతావనిన్ !

ఈయన్యాయముహూర్తముల్ గడచి పోయెన్ ముందు నా జీవితా
ధ్యాయం బెట్లు ముగించుకొందు ? నిట సూర్యస్పృష్టమా మేను న
న్యాయత్తం బొనరింతునో ! మరణపర్యంతంబు శ్రీభాస్కరా
ర్చాయోగమ్మునఁ దృప్తి నందుదునో ! నిర్ధారింతు మం దెప్పుడో !

# సంశయవిమోక్షము

తలఁగనిచింతతో బ్రదుకుదానికి నీ యొకబిడ్డతల్లికిన్
బరిణయమంట ! తండ్రి యొకవంక ముహూర్తము మించు నంచు తొం
దరపడుచుండెఁ దొల్లి యెడఁదన్ స్పృశియించిన బాడబాగ్నివి
స్ఫురణము నేఁటికిన్ సమసి పోవదు తోఁచదు దారి యేమియున్.

ఈమది నెల్లవేళ దహియించెడి నాయపచార మేరితో
నే మని చెప్పికోఁగల నిసీ ! మఱి చెప్పక సార్వభౌమునిన్
భీమపరాక్రమోజ్జ్వలునిఁ బెండిలివేసమువానిఁ గౌరవ
గ్రామణిఁ బాండుభూవిభు నకారణ మెట్లు తిరస్కరించెదన్ ?

ఒకదివ్యున్ బనిమాలిఁ బిల్చుకొని తద్యోగమ్ముచే నొక్కపు
త్రకునిం గాంచి యనుక్షణంబు గతవృత్తాంతమ్ము లోలోన జ్ఞ
ప్తికి రాఁ బాండునృపాలుచెంత నిజపాతివ్రత్య మేరీతి ని
ల్పుకొనం జాలుదు నేరికైనఁ గలవే ము న్నిట్టివ్యత్యాసముల్ ?

పుట్టినబిడ్డనిన్ విడిచిపుచ్చితి నీటఁ దదీయవార్తయే
కట్ట ! యెఱుంగరాదు- చిరకాలము వాని స్మరింపకుండఁగా
నెట్టులు సైచియుందు ? స్మరియించుచుఁ గౌరవచక్రవర్తితో
గుట్టుగఁ గాఁపురంబు ననుకూలముగా నెటు నిర్వహించెదన్ ?

ఈ నాకుజ్జ్వలసంపుఁద ప్పటికి పోదే విశ్వమందెల్లఁ “గుం
తీ ! నీమంత్రము మండిపోను; పిననాఁడే యింతఁ గావించి యా
పైనన్ బెండ్లికి సిద్ధమై యొకమహావంశమ్మునన్ మచ్చ నే
లా నిర్మించితి ?” వన్నవారికడ మా ఆడంగ నో రాడునే ?

పతియే దైవ మఁటంచు రూఢతర మా భావంబు నేనాఁడో భా
రతనారీమణి నేర్చుకొన్నయది– ఔరా ! నేఁడు దుర్భావనా
న్వితమై బుద్ధి నశింపఁగాఁ దెలియకుంటిన్ గార్యమున్ నా కిటన్
బతియే దైవమొ, దైవమే పతియొ, నా స్వామీ ! ప్రబోధింపవా ?

శ్రుతినాదమ్ముల మేళవించి వినవచ్చున్ దూర్యనిస్వానముల్
కుతుకం బొప్ప వరుండు పీటపయినన్ గూర్చుండె వైవాహిక
వ్రతముంబూనఁగ– నేగుదెంచె సుముహూర్తం– బిందు నాపెండ్లియో
మృతియో చక్కఁగ నిర్ణయింపఁ దగునోయీ నీవె తేజోనిధీ !

నీకన్యాత్వము నిష్కలంక మని మున్నే చెప్పియున్నావు కా
నీ కన్పించును సందియం బొకటి యుల్లేఖైన నిష్కారణం
బాకర్ణోజ్జ్వలకుండలున్ మధురహాసాంకూరరోచిష్ణు నా
రాకాచంద్రుని నీటఁ గల్పుకొనుదౌర్భాగ్యం బి దేలా ప్రభూ ?

మాతకుసైతము న్నుడువ మాని దురంతమహావమానమున్
నాతల కెత్తికొంటి నొకనాఁటియకృత్యఫలంబు గాఁగ, నా
కాతరతన్ వదల్చితివి గాని తదాదిగ జీవితమ్ములో
నీ తెరవెన్క భాగవత నేటికి నే నకలంక నైనచో ?

మున్ను దివమ్మున న్నరకమున్ మఱి నారకమందు స్వర్గమున్
గన్నదినంబు లేగినవి నాఁటికి నేఁటికి జీవితంబులోఁ
గొన్నది దుఃఖమో సుఖమొ కూడ యెఱుంగని మూఢబుద్ధితో
నున్నయభాగ్యురాలను గదోయి దివాకర ! దారిఁ జూపరా !

నీసందేహము లే నెఱింగితిని దన్వీ ! దీనికై యింత సం
త్రాసంబా ? భవితవ్యతాఫలము గాదా యిద్ది ? నిష్కారణం
బా సంకోచము మాని తప్పక వివాహం బాడు, మేనాఁటికో
నీసంతానముమాట తెల్లమగుఁ దానే ప్రాప్తకాలమ్మునన్.

అతుకనియుత్తరం బిది, మహాత్మ ! సరే, యగుఁగాక దుఃఖపూ
రితగృహిణీస్వరూపము ధరించెద, రేపటినుండి "దుష్కులం
కిత" యని రాఁదలంచు నపకీర్తి భరించెద నోర్పుమై యుదా
హృత మగు దాశకన్యకచరిత్రము నాదగు జీవితమ్మునన్.

# హృదయస్ఫులింగము

పతి యూ పాంసువిభూంను "నీ వదనబింబంబంను నేనాఁటికిన్
గుతుకం బన్నది చూడనా?" యనుచు మూర్ఛున్, నిత్యమున్ సమ్ముఖ
స్థిత యై దీనముగా సపత్ని యగు మాద్రీబాల యత్యంతమున్
బ్రతిమాలున్ హృదయస్థమామకవిచారం బింత లక్షించుచున్.

అడఁగం ద్రొక్కఁగఁ జాల నాహృదయదావాగ్నిస్ఫులింగచ్ఛటల్
వెడలం ద్రోయఁగఁ జాల- గూఢతరమర్మవ్రాతమ్ములో నిట్టు లీ
నడిసంద్రమ్మున నీఁదులాడుటకు నంతం బెన్నఁడో! యింతగాఁ
బడు సంక్షోభము తేటతెల్లముగ విశ్వవ్యాప్త మౌ టెన్నఁడో!

ఆనీరంధ్రనదీప్రవాహ మను శయ్యాసీమఁ దద్వీచికా
స్వానంబుల్ దగు జోలపాటలుగఁ బార్శ్వవ్యాప్తతజ్జంతుసం
తానంబుల్ పరివారమై చెలఁగ నెన్నాళ్లుంటివో తండ్రి! యీ
మానం బేదిన తుచ్ఛమాత కొకనిర్మాల్యప్రసూనంబవై.

ఏ దేశమ్ములలోని కీడ్చుకొనిపోయె న్నిన్ను మాతృత్వమ
ర్యాద న్వీడిన నాయకృత్యము, కుమారా! నేఁడు ప్రాణమ్ముతో
నేదే నొక్కెడ బిచ్చగాఁడ వయి క్షుత్తృడ్బాధకుల్ లోఁగి యెం
తో దైన్యమ్మువ నుంటివో! యసలు లేవో! నాబహిఃప్రాణమా!

పుడమి ననన్యతేజమునఁ బుట్టినయప్పుడె తల్లిదండ్రులన్
విడుచు నభాగ్యశాలి వయి నిల్చితి వే తెరచాటునందో నా
కొడుక ! రవంత నేఁటివఱకున్ మనుభాగ్యమె కల్గియున్న నే
కొడుకులు లేనిదంపతులకో శరణార్థివి కమ్ము నాయనా !

ఆకర్ణోజ్జ్వలనైజకుండలయుగం, బాసొకుమార్యాపణం
బాకర్ణాంతవిశాలనేత్రయుగళం, బాకోటిసూర్యప్రభా
నీకాశం బగుదివ్యదేహ మెపుడున్ వీక్షించు భాగ్యోదయం
బేకాంతామణికిన్ లభించినదొ తండ్రీ ! నాకు లేదయ్యెగా !

కులగోత్రమ్ము లెఱుంగరాని నిను నక్కుం జేర్చి యేతల్లి వ
త్సలతాజ్యోతిని బర్వఁజేసి తనదుగ్ధం బిచ్చె- నాయమ్మ కం
జలి సంధించుట కైన నేఁ దగను వత్సా ! నీవె సద్భక్తి ని
ర్మలసేవాపరినిష్ఠితుండ వయి తన్మాతృఋణముం దీర్పుమా !

కౌంతేయుండవుగా జగత్త్రితయవిఖ్యాతిన్ విడంబించి య
త్యంతప్రాభవ మంద నర్హుఁడవు బిడ్డా ! కర్మదోషంబుచేఁ
జింతాదైన్యతిరోహితుండ వయి నిస్తేజుండ వై యెంతగా
వంతం బొందితివో నిరంతరపరీభావమ్మునన్ గ్రుక్కుచున్ ?

నీతలిదండ్రు లెవ్వ రని నీకుల మే మని యెవ్వ రేని ని
ర్హేతుక మైనప్రశ్న వెలయించిననాఁడు నిరుత్తరుండవై
కాతరభావ మేర్పడ మొగమ్మున విన్నదనంబు తోఁప నే
రీతిగ నశ్రువుల్ నిలువరింతువురా! దురదృష్టబాలకా?

"ఊకుం బేసను లేనితల్లి యొకనాఁ డున్మత్తయై యాపగా
తీరంబం దొకతప్పుఁ జేసి యది రుద్దేక నాశిరంబందు ని
ష్కారుణ్యమ్మున నీటఁ ద్రోసె" నని యాకర్ణించి యేనాఁడో యీ
నారీరాక్షసి నెంతఁ గాల్తువో నితాంతక్షుబ్ధచిత్తాగ్నిలో?

ఏనాఁడైనను నిన్నుఁ జూచెడి మహాదృష్టంబె నా కున్నచో
నేనై నీ కెఱిఁగింపఁగాఁ దలఁచుకొంటిన్ నావిపర్యాసమున్
గానీ అట్టి పవిత్ర పూదినము శుష్కంబైన యీదృష్టికిన్
రానై యున్నదొ! లేదొ! దానికొఱ కేరా నేను జీవించుటల్!

నీయాశాతతి కంత మున్నదియె కుంతీ! ఓసి నిర్భాగ్యురా
లా! యేనాఁటిసుతుండు వానికొఱ కేలా యిన్ని రాద్ధాంతముల్?
ఆయుష్మంతుఁడె యైనచోఁ దనకుఁ దానై వచ్చు, లేకున్నచో
నీయానందము బుగ్గి యయ్యెఁగద వానిన్ మీఁకుకొన్నప్పుడే!

# మంత్రకథనము

మనసంయుక్తపురాభవోపచితకర్మమ్ముల్ ఫలింపంగ నీ
మునిశాపం బొకహేతువైనది, తపఃపూతమ్ముగా జీవితం
బనుకల్పించుటకన్న మార్గ మికఁ నన్యం బున్నదే! పూజ్యమౌ
వనవాసమ్మును జింతతోఁ గలుషితప్రాయమ్ముఁ గావింతురే?

"పున్నామాబ్ధిఁ దరింప నొక్కఁడయినన్ బుత్రుండు లేఁ" డంచు మీ
రన్నా రయ్యది నిక్కమే యగును నాథా! కాని యిట్లీవృథా
ఖిన్నత్వమ్మున నేమగున్, వలయుచక్కిన్ బుత్రజన్మార్థమై
సన్నాహించిన మంత్రతంత్రములు లక్షల్ కోట్లు లేవా ధరన్?

ఏ నిన్నాళ్లుగ భీతిచే మనసునందే గుట్టుగా దాచికొ
న్నానయ్యా యొకమాట నాజననికైనం జెప్పఁగా లేక, నేఁ
డైనన్ దప్పుల సైప మిమ్మభయ మభ్యర్థించి మీయంఘ్రులన్
ప్రాణం బుంచి వచించుచుంటి హృదయేశా! యింత మన్నింపరే?

ఇది యేనాఁటిదొ చిత్రవార్త, తరి యయ్యోన్ విన్నవింపంగ నా
పదిరెండేఁడులయీడునాఁడు ముని దూర్వాసుండు మాయింటికిన్
ముదితుండై చనుదెంచెఁ నాజనకుఁడో భోజుండు సద్భక్తితో
నెనరై యుక్తసపర్యలం దనిపె మౌనీంద్రున్ గృతానందుఁడై.

"వ్రతమో దీక్షయొ మాపురమ్మున నే నిర్వర్తించి మమ్మెల్లరన్
కృతులం జేయుఁ" డఁటన్న ప్రార్థనకు నంగీకారముం జూపె నా
యతివర్యుం డటుపై నిమేషమున రాజాజ్ఞానుసారమ్ముగా
హితరూపం బగు నావిహారవన మయ్యెన్ స్వామి కావాసమై.

అది నాపాపమొ పుణ్యమో యెఱుఁగనయ్యా! స్వామి సేవింప నా
హృదయం బువ్విళులూరెఁ దండ్రియుఁ గుమారీవత్సలుం డౌట స
మ్మదముం జూపెఁ - దదాదిగా నుపచరింపం బూనితిన్ భక్తిసం
పద లొప్పారఁగ నాల్గుమాసములు తద్బ్రహ్మర్షి చింతామణిన్.

కాలం బింతయుఁ దప్పనీయక సమిత్ఖండమ్ములున్ గందముల్
మూలంబుల్ ఫల పత్ర పుష్పనివహమ్ముల్ దర్భలుం దెచ్చి త
త్కాలక్షీరఘృతాదులన్ శుచిగ నాకల్పించి సేవించితిన్
జాలన్ దత్కృప సేకరించుచు మునిస్వామిన్ జతుర్మాసముల్.

నాలుగుమాసముల్ చనిననాఁడు మునీంద్రుఁడు నన్నుఁ జూచి "యో
బాలిక! నీ వొనర్చిన సపర్యలకున్ ఫలమీయకే చనం
బోల" దఁటంచు నావిముఖబుద్ధి గణింపక బల్మి ప్రాభవో
ద్వేలము మంత్ర మొండు నుపదేశ మొనర్చి చనెన్ యథేచ్ఛగా.

ఆమంత్రమ్మున కర్థ మే మనినఁ, బుత్రాసక్తి నేదేవునే
నామంత్రించి పఠించుచో నతఁడు సద్యస్కాల మే తెంచి స
ద్ధామస్ఫూర్తి ననుగ్రహించు నొకసంతానంబు నద్దాన నో
ధీమాన్యా! యొకయింత చేకుఱదు పాతివ్రత్యలోపం బిలన్.

కావున మీర లింత యధికార మొసంగిన నేఁడొ రేపొ దీ
క్షావిధి మంత్రరాజము నచంచలనై జపియించి పుత్రులన్
దావకవృత్తికిన్ సముచితంబుగఁ గాంచెద ధర్మరూప మై
పావన మై త్రిలోకవిభవమ్మున నీకుల ముల్లసిల్లెడిన్.

ఆలోచింపుఁడు మీరుఁగూడఁ గురునాథా! ఊర కే పెద్దయుం
గాలం బీగతి దారి తెన్ను లరయంగా లేక చింతించు టే
మేలో పుత్రుల నెట్టులైనఁ గను టే మేలో త్వదీయాన్వయ
శ్రీల న్నిల్పఁగ నీవిధం బె కనుపించె న్నాకు యుక్తంబుగా.

అనినం గోపము వచ్చునేమొ తమ కయ్యా! మీరు మీయన్నయున్
జననం బైనవిధంబుఁ బూజ్యుఁ డగు వ్యాసస్వామి కుల్యాతటిన్
జననం బైనవిధంబు నెట్టిదియొ సుస్పష్టమ్ముగా నేఁ డెఱుం
గనివా రెవ్వరు? దాన మీ కొకకళంకం బింత రాలేదుగా?

# మాద్రీప్రలోభనము

ఈతఁడు ధర్మపుత్రుఁడు సుమీ ! మఱి యీతఁడు వాయునందనుం,
డీతఁడు వాసవాత్మజుఁ, డదేమొ హఠాత్తుగ విస్ఫురోస్రభన్
మూర్తినిఁ ద్రిప్పుకొంటివి ! సముజ్జ్వలరూపవిలాసవంత మా
ఈతనయత్రయం బనిన నేల యనాదృతి నీవుఁ జెల్లెలా ?

పతి యత్యంతవిషాదమూర్తి యయి శాపగ్రస్తుఁడై పుత్రసం
తతికై నిత్యముఁ గుందుచుంటఁ గనలేదా నీవునుంగూడ— నా
పతియాదేశముఁ గొంటిఁ దత్కులము నిల్పన్ మంత్రపూతమ్ముగా
సుతులం గాంచితినమ్మ ! దీన నొకసంక్షోభమ్ము లే దింతయున్.

దేవాధీశు లనుగ్రహించిరి కృపాదృష్టిన్, బ్రమోదామృత
స్రావస్విన్నము లయ్యె నాకనులు, విశ్వంబందు గొడ్రాలనై
చావంబోవునవస్థ తప్పినది— విశ్వాసమ్ముతో ధర్మపుం
ద్రోవం బోయిన నాయెడన్ బతియెడన్ దోషంబు శంకింతువా ?

ఒసఁగెను మంత్రమున్ మును మహోత్తముఁడౌ మునినాథుఁ డాజ్ఞఁదా
నొసఁగెను భర్తయున్, గులసముద్ధరణం బొక ముఖ్యకార్య— మీ
యసదృశమంత్రరాజము మహామతినై జపియించి ముగ్గురన్
సిసువులఁ గాంచితిన్ పసవు నిల్పితిఁ దప్పిద మేమి చెల్లెలా ?

ఉన్నాఁ డేకద యీతపోవనమునం దుత్ఫుల్లవిజ్ఞానసం
పన్నుల్ మహానులు ధర్మవేత్త, లిది సంభావించి వారే "బలీ"
యన్నా రింకను దృష్టియే కలుగలేదా నేఁటి నాకార్యమం
దన్నన్నా ! యిది యేమిబేలతన మమ్మా ! నీకు నున్మాదినీ ?

స్త్రీనై పుట్టఁగరాదు పుట్టినను మాతృత్వంబు లేకుంట య
న్యాయం, బింతకు దుఃఖరూప మగు జన్మంబందు నేదో సుఖ
చ్ఛాయాలేశము కల్గుచో నదియె సత్సంతాన, మద్దాని ధ
ర్మాయత్త మ్మగువృత్తిచేఁ బడసి సౌఖ్యం బంద దోసంబఁటే !

ఆపసిబుగ్గ లాకనులయందము లాజయవీరలక్ష్మికిన్
గాఁపుర మొప్పఁగా సొబగుకండలు దేరిన లేతమేనులున్
బాపురె ! సౌకుమార్యవిభవమ్మున కాకరమూర్తు లైన నా
పాపలఁ జూచి మాతృపదభాగ్యముఁ గోరనికాంత యుండునే ?

చెల్లీ ! నీకును సైతమున్ సుతుల నాశ్లేషించి ముద్దాడఁగా
నుల్లాసం బొకయింత లేదా, కనలేవో ! పెంపఁగాలేవా ! నీ
యుల్లం బింత యెఱింగితిన్ బలిని నే నొప్పింతు నీకోర్కెయున్
జెల్లుంగావుత నేఁడె నీకు నుపదేశింతున్ మహామంత్రమున్.

ఈమంత్రమ్ము జపించుకొమ్ము మదిఁ బుత్రేచ్ఛన్ బ్రదర్శించి, ని
స్సీమంబౌ దృఢభక్తితో నిపుడ యశ్విద్వంద్వముం బిల్వ, మా
స్వాముల్ నిన్ను ననుగ్రహింతురు సుతద్వంద్వమ్ము చేకూఱు నీ
నోముల్ పండును నీహృదంతరమునన్ బొంగున్ సుధాసింధువుల్.

ఈసంతానము దైవదత్త మనుమాటే గాని పాండుప్రభుం
డే సత్యమ్ముగ వంశకర్త యయి తా నేపారు, నస్మత్సుతుల్
వాసిం గాంతురు పాండవాఖ్య, శుభసంపత్పూర్ణమై పూతమై
ఆసూర్యమ్ముగ నాశశాంకముగ విఖ్యాతిం గనున్ వంశమున్.

విను మిదికూడ— నీవు ప్రసవింపుము పిమ్మట వారి నెల్లరన్
బెనిచెడిబాధ్యతల్ వదలిపెట్టుము నాపయి— నింకఁ జూడు నీ
తనయులవీరవిక్రమము ధర్మపరిస్ఫురణంబు— సద్యశో
ఘనముగ వీరమాతలము గావలె నీవును నేనుఁ జెల్లెలా !

ఊరక శుష్కతర్కముల యుక్త మయుక్తము నెంచఁబోక నా
గౌరవముం దలంచి సరిగా విను, మిట్టిమహావకాశమున్
గోరి స్వబుద్ధిమై వదలుకొన్న నొకప్పుడు గొడ్డురాలవై
పరికిఁగాక చత్తువు సుమీ ! నిజ మాడిన నిష్ఠురం బగున్.

# పతివియోగము

శాపం బింత దలంపవో మదనచాంచల్యమ్మునం జిక్కి మా
ద్రీపాణిన్ స్పృశియించి యాక్షణమె నిర్జీవుండవై సోలినా
వో పాండుప్రభు ! ఏపురాజననదుర్యోగంబొ నాఫాలపుం
దీపం బార్పెను, గొంతుఁ గోసెఁ, దలఁ దన్నెన్ లిప్తమాత్రంబులో ?

"తల్లీ ! నీకు నమస్కరింతు విసపుం దైవంబు భాగ్యమ్ములన్
గొల్లంగొట్టె సుఖంబుకోస మని యాక్రోశింపకే ! భర్తతో
సల్లాపమ్ముల మానవే ! నిలుపవే ! సంసార" మం చెంతయున్
దెల్లం బొగతి నెన్నిచెప్పితిని మాద్రీ ! నీకు నిన్నాళ్లుగా ?

నాపలు కొక్కలైనను వినంబడెనే మును నీకు మత్తుఁడై
శాపముమాటనే మఱచి స్వామి యొకించుక వేగిరింపఁగా
నాపఁగరాని ఘోరమదనానలమం దతనిన్ దహించి యీ
పాపలఁ జీఁకటింటఁ బడవైచితి వోసి ప్రతీపదర్శినీ !

పోనీ మించినదాని కేమి ! రతిలుబ్ధుం డై హతాన్నిర్గత
ప్రాణుం డౌ పతిదేవు నే ననుసరింపం బోవ వారించుచున్
దీనత్వమ్మున నొట్టు బెట్టి యిటు లాదేశించి పుత్రార్థమై
మేనున్ భర్తృచితాగ్నిలో విడిచి తమ్మా ! ఎంత ధన్యాత్మవే ?

నీపున్ భర్తయు నద్వితీయము నకలంకీభూత మత్యంత పూ
దేవత్వమ్ము గడించి నందనవనోద్దేశంబులం దెప్పుడున్
బూవుంబాన్పుల నిర్నిరోధవిపులామోదంబు మీఱన్ సుధా
సేవాపంక్తితు తాచుఁ జూఱఁగొనుఁడీ శృంగారసర్వస్వమున్ !

ఒకనాఁ డంటివి "బిడ్డలం బెనుచు నుద్యోగంబు నా" దంచు, నేఁ
డకటా ! యయ్యది నిక్క మయ్యె నసహాయం బయ్యె నాజీవితం
బీఁకఁ గా ల్సేతు లదల్చుచున్ నగుచు న న్నీక్షించుచున్నట్టి య
ర్భకులన్ వీరలఁ జక్కఁగాఁ బెనుచుమార్గం బెట్లు లోకమ్మునన్ ?

హృదయముఁ గొన్నబిడ్డ యెట కేగెనో ? యెట్టియవస్థ నుండెనో ?
వెదకుచు రేవగళ్లు విలపించుచుఁ జావఁగలేక యెట్టులో
బ్రదుకుచు నున్న నాశిరముపై మఱి యైదుగు రైన యీనిరా
స్పదులను బిడ్డలం బెనుచుభారము నిల్చె నవశ్యరూపమై.

క్షితి నీదీనుల కింక నేమిగతి ? చీ ! చీ ! ఎంతమాటాడితిన్
గతి లేదా మఱి నానిసుంగులకు ?— లోకంబందుఁ బెత్తండ్రి యా
ధృతరాష్ట్రుం డొకఁ డుండఁడే కరిపురాధీశుండు— తత్పుత్రసం
తతితోఁబాటుగ సోదరాత్మజులసైతం బింత మన్నింపఁడా ?

ఏటికి నాదరింపఁ డిపుడే పయనించెద హాస్తినాపురీ
వాటికి బిడ్డలం గొని తపస్వులు కొందఱు ఘోరము గాఁగ నా
ఖేటము నాఁటినుండి యెఱిఁగించెద వార్తల, సత్యధర్మముల్
దాటి తొలంగునో యతఁడు ! తమ్ముని బిడ్డల నీసడించునో !

అతఁ డంధుం డయి రాజ్యపాలనముఁ జేయన్ లేని యత్యంతదు
స్థితి నున్నప్పుడు పాండురాజు నిజశక్తిన్ సేతుశీతాద్రివి
స్తృత మారాజ్యము నిర్వహించి ధరణీసింహాసనం బన్నకే
ప్రతిపాదించుట లోక మిం తెఱుఁగదా ? భావింపఁడా యాతఁడున్ ?

నాదగు పర్యవేక్షణమునన్ లవమేని కొఱంత లేక యీ
యైదుగురున్ గురూత్తముని యాదరణమ్మున శాస్త్రముల్ ధను
ర్వేదము నభ్యసించి పృథివిన్ సరిగాననివీరు లై ప్రజా
మోదము మీఱ రాజ్యసుఖముల్ గొనునట్టు లొనర్తు నే నిఁకన్.

కౌరవ్యావళికన్న వేయిమడుఁగుల్ కౌంతేయమాద్రేయులే
ధీరాగ్రేసరు లన్నకీర్తిఁ గొనురీతిన్ వీరి శిక్షించెదన్
గారాబమ్మునఁ బెంచుకొందు శిశురక్షారూప మా చాతురీ
పారీణత్వము కుంతిసొమ్మనుచు విశ్వంబందుఁ జాటించెదన్.

# కుమారాస్త్రవిద్యాసందర్శనము

శ్రీసంపన్నము లౌచు నాకసులు న్వెల్గన్ గుమారాస్త్రవి
ద్యాసందర్శనభాగ్య మబ్బె- స్ఫలవంతం బయ్యె జన్మంబు- నేఁ
డీసంతోషముహూర్తముం గనుఁడు మాద్రీ! పాండుభూపాల! మీ
రాసౌరాలయసీమనుండియె కుమారౌఘమ్ము దీవించుచున్.

ఆయతబాహావిక్రమసమన్వితులున్ ధృతిశీలు రస్త్రవి
ద్యాయుతు లైన నాసుతులదగ్గఱఁ గౌరవు లెంతవారు? గాం
గేయుఁడు పల్కలేక పలికెన్ "సము" లంచును దూరదృష్టిచే
నీయెడ నేరివిక్రమము లెట్టివొ యెవ్వ రెఱుంగ రాత్మలన్?

"గురుఁ డేకపక్షపాతమునకుం దిగి చక్కఁగఁ బాండవాళికిన్
గఱపెను విద్య, లందును ధనంజయుఁ డాతనిప్రాణ, మేమిమ
త్సరమొ రవంత మమ్ము నుచితంబుగఁ జూడఁ" డటంచుఁ జాటుగా
మొఱలిడి రంట యీయుడుకుఁబోతులు కౌరవు లెల్లఁ దండ్రితో.

నారిన్ వింటను గూర్చి తద్ధ్వని దిగంతస్సీమ మార్మ్రోయఁగా
ధీరత్వమ్మున సింగపుంగొదమరీతిన్ వేదికారోహణ
ప్రారంభుం డయి నిల్చె నర్జునుఁడు భాస్వద్వీరవేషమ్ముతో
నౌరా! వీనికి నుద్దియై నిలువ శక్యంబే పురారాతికిన్?

తమలో నెవ్వరుఁ గ్రీడిచెంత ధను వెత్తన్ లేక యెవ్వానికో
సమొ చేసన్నలఁ బిల్చుచున్ గడు నిరీక్షం జేయుచున్నారు దు
ర్దము లాకౌరవుల్ లల్లదే యెవఁడో దూరంబందు పార్థప్రతి
ప్రముఖుం డౌచు బయల్పడెన్ బృథుధనుర్దండంబు దీపింపఁగా.

ప్రతివీరుం డగునాతఁ డద్భుతశరవ్యాపార మేపార ను
ద్ధతుఁ డై చిత్రవిచిత్రరీతుల సభాస్తారాళి మెప్పించె మ
త్సుతుఁ డౌనర్జునుఁ డింత ఆచ్చవడి చూచుర్ ద్వంద్వయుద్ధంబులోఁ
జతురత్వమ్మును జూడఁగా జనులు నుత్సాహించుచున్నా రహో !

అనుమానించి సభాధినాథుఁ "డెవ రయ్యా ! రాజపుత్రార్థమే
చను నీయస్త్రపరీక్ష; నీకు నవకాశం బీయఁగా వీలు లే"
దని వారింపఁగ నూత్నబాలకుఁడు కట్టా ! ఘోరలజ్జానతా
ననుఁ డై వెల్వెలఁ బోవుచుండె నవమానక్షుబ్ధచిత్తమ్మునన్.

పొంగుబుజాలపెం పడఁగిపోవఁగ, నవ్యమహోత్సవప్రభా
మంగళ మౌ ముఖాబ్జ మవమానభరమ్మున డిందఁగా, భుజా
సంగత మైన వి ల్లవని జాఱిపడన్, శుభవీరముద్ర నై
జాంగమునుండి యోసరిల నాదయనీయుఁడు నిల్చె నవ్వలన్.

పోనీ పెద్దలపంత నేమి? సమ హా బుద్ధిన్ బ్రదర్శించుచున్
రానీరాదా! యొకింత బిడ్డలను జేరం గల్పఁగారాదా! యా
స్థానంబం దొకవీరవర్యునిఁ దిరస్కారమ్ముఁ గావింప న
ద్దానం గల్గినగొప్ప వీరలకుమాత్రం బేమి యోచింపఁగా?

"రాధేయుం" డని "సూతపుత్రుఁ" డని పాఱంద్రోలి రవ్వాని మా
యోధుల్ పీఠముఁ జేరనీక; యతఁ డత్యుద్రిక్తుఁ డై తత్సభా
నాథుం జూచుచు మాసుయోధనుని వెంటన్ బోవుచున్నాఁ డహో!
రాధాసూతుల కిట్టిపుత్రుఁడఁట! ఔరా! యెంతయాశ్చర్యమా?

ఆసుకుమారమూర్తిఁ గనినంతనె చిత్తము మాతృభావసం
వాసిత మై తదీయపరిభావము నెంచి కలంగె నక్కటా!
ఈసభవారిలో నెవరికేనియుఁ గల్గనిచింత యొందు నన్
గాసిలఁజేయుచుండె నొకనాఁటియుదంతము జ్ఞప్తిఁ దెచ్చుచున్.

వాఁ డెవఁ డద్దిరా! ఉదయభాస్కరతేజుఁడు, వీరలక్ష్మికిన్
గోడెముకాఁడు, నేల్కవచకుండలయుగ్మమువాఁడు, నాయెడన్
నేఁ డొకవత్సలత్వమును నింపినవాఁ డలనాఁటిపాపఁడే
కాఁడు గదా! యి దేమి కల గాదు గదా విపరీతదైవమా?

# అనునయము

నీవు ధనుర్ధరుండ వయి నిల్వఁగ నాసభవారు నిన్ బరీ
భావితుఁ జేసి ధర్మ మెడఁబాసిరి- నా కిదియెల్ల దుర్భరం
బై వికలాత్ము నిన్ బిలువ నంపితి నూఱడి వెట్ట- నింతలో
రా వనుకొంటి వచ్చితివిరా! సుకుమార! మదాజ్ఞ నెంచుచున్?

జరిగినదాని కింతయు విచారము నందకుమయ్య! సత్కళా
స్ఫురితుఁడ వెవ్వరో యొకరు చుల్కనఁ జూచిన లోకదృష్టికిన్
మఱుఁగయి యుండఁజాలదు సుమా భవదద్భుతదీప్తి; యెన్నఁడో
తరుణము వచ్చు; నాఁడు బహుధా వెలయింతువు కీర్తిచంద్రికల్.

మది నొకచింత మాని సుసమగ్రముగాఁ బనివట్టి శాస్త్రముల్
చదువు, మితోఽధికంబు శరకౌశలముం గడియింపు, మాపయిన్
వదలుము దుష్టమైత్రి; యది ప్రాణముమీఁదికిఁ దెచ్చుఁ, గీర్తిసం
పదల హరించు; నీ కనుభవ మ్మిసుమంతయు లేదు నాయనా!

అడిగెద నొక్కసంగతి- సభాంగణముం ద్యజియించి వారివెం
బడిఁ బరుగెత్తినావుగద వారికి నీకును నింతమైత్రి యే
ర్పడుటకు నేమికారణము, బాలుఁడ! యేమిగుణంబుఁ జూచి యా
చెడుగుల నింతగాఁ జనవుఁ జేసితి వోయి వివేకహీనుఁడా?

ఆ దుర్యోధనుచిత్త మిం తెఱుఁగవయ్యా నీవు– చిన్నప్పుడే
కాదా నాపసివాండ్రపైన విసప్రం గన్నించె, భీసంశయో
న్మాదుం డౌచు విసమ్ము వెట్టి నదిలోనం ద్రోసె భీమన్న, నా
రా దౌర్భాగ్యుఁడ! అట్టివానిసహకారం బెట్లు నీ కబ్బెరా?

నిన్నిపు డంగరాజ్యపదసిస్థితుఁ జేసినమాత్రఁ దద్గుణా
భ్యున్నతి లోకపూజ్య మగునో! మఱి వాఁడు సధర్ముఁ డయ్యెనో
క్రన్నన నీకు వానిసహకారముచే నొకనాఁడు ముప్పు రా
నున్నదిరా యమాయికుఁడ, ఓర్వమిచే నిటు లాడలేదురా!

వాఁడును దమ్ములుం బరులపచ్చ సహింపరు– వారియిండ్లలో
నూడెము మానుకొ మ్మనికో బలి వెట్టి వధింత్రు నిన్ను– నే
వేఁడెద విద్యలందు భుజవిక్రమమందును ధర్మమందు నీ
కీ డగువారితో మసలు– మెల్లరు మెచ్చఁగలావు దానికిన్.

నా శోకచింత కల్గినది నాయన! నిన్నుఁ దలంచి– యిన్నియ
స్త్రాకలఁ దేఱి యోధవను లౌ నని మెచ్చుధనుర్ధరత్వమున్
జేకొని యున్ననీ కధివసింపఁగఁ జాలినపీఠ మేది? ని
క్ష్లికునియింటిలోఁ బడి కృశించితివే కద యిన్నినాళ్లుగా!

సూతునియింటిలోఁ జదువు సున్న- రవంత ప్రరోహాభివృద్ధియున్
జాత మఁటన్నఁ గన్పడదు- శోభకు రాఁడిక నెట్టిశక్తియున్,
సూతకులార్హ మైన రథచోదకభారముగూడ నెన్నఁడో
నీతలపైన వ్రాలు దయనీయుఁడ! నీభవితవ్య మేమిరా?

నాయింటన్ వసియింపు నాసుతులకన్నన్ మిన్నఁగా నిన్ను నా
ప్యాయం బేర్పడఁ బెంచుకొందు- భవదీయప్రజ్ఞ కర్హమ్ము లా
శ్రేయమ్ముల్ సవరింతు నుచ్చతరకీర్తిప్రాభవస్ఫూర్తి దీ
ర్ఘాయుష్మంతుఁడ వై యెసంగుదువు బిడ్డా! రమ్ము నాయింటికిన్.

నదిలోనన్ బయనించు నిన్నుఁ గని విన్నాణమ్ముగాఁ బెంచి రా
ముదితస్వాంతులు సూతదంపతులు- తత్పుత్రుండ వై యుంట కి
య్యదియే కారణ మింత నీ వెఱుఁగవా? యర్థింతు నవ్వారి, నిన్
విదితప్రజ్ఞునిఁ జేసి "దేవసుతుఁ"డన్ విఖ్యాతిఁ గల్పించెదన్.

ఆఁగుము నీమనోరథ మనర్హము, నిక్కపుఁదల్లి వౌతె నే
బాగొనరింతు నీవిషమభావిపథమ్మును; సంశయింతువా?
మూఁగఁదనమ్ముతో వెడలిపోవఁ గరమ్ముల మోడ్చుచుంటివా?
ఏగుము నీయదృష్టమున కెవ్వరు కర్తలు ధూర్తబాలుఁడా?

# ఉత్తరఖండము — విషయసూచిక.

# సింహావలోకనము

పదమూఁడేఁడులకష్టకాలము సమాప్తం బయ్యెఁ; న్పాప్పృతకుల్
పదిలంబార వసించినారఁట యుపప్లావ్యమ్మునం దింక దు
ర్మను లా కౌరవు లర్ధరాజ్యమును ధర్మస్వాంతు లై యీయఁజా
లుదురో! యెప్పటిపాటఁ గాదుదురో! తేలున్ రేపట న్మాపటన్.

యావజ్జీవము పాండునందనవధోపాయైకకార్యక్రమ
ప్రావీణ్యమ్ము గడించుచే తమకుఁ గర్తవ్యంబుగాఁ జూచు దు
ర్భావుల్ కౌరవు లూరకే యిప్పుడు సామ్రాజ్యంబు భాగించు ధ
ర్మావిర్భూతి మెలంగిరేని శశిమార్తాండుల్ గతిం దప్పరే?

మాయాద్యూతమునందు నాసుతుల సామ్రాజ్యంబు స్వాతంత్ర్యమున్
మాయం జేసి మహాసభాంతరమునం బాంచాలి నీడ్పించి య
న్యాయప్రక్రియ వల్వ లొల్వ మును దుర్యత్నంబు సాగించి రీ
మాయావుల్ తమయంతఁ బంచుదురె సామాన్యంబుగా రాజ్యమున్?

సమరంబందు గురుండు భీష్ముఁడుఁ గృపాశ్వత్థామ లేనాఁటికిన్
దమపక్షమ్మును వీడ రంచు విజయానందమ్ము సాధింపఁగాఁ
దమకే చెల్లు నఁటంచు నెంతయు మహోత్సాహమ్ముతో నుండి రీ
కుమతుల్ గోగ్రహణమ్మునాఁ డెఱుఁగ రొక్కో! తారతమ్యమ్ములన్?

వీరగ్రామణి కర్ణుఁ డొక్కఁడు రణోర్వి న్నిల్చి కోదండమున్
సారింపన్ దొరకొన్నఁ బాండవుల పంచత్వమ్ము నిక్కం బగున్
తీరు న్నాఁడు సమస్య లెల్ల నని యుద్రేకమ్మున న్నమ్మియు
న్నా రామూర్ఖులు, వెఱ్ఱి గాని తిర మానా కర్ణుఁ డవ్వారికిన్ ?

ఇంకను సూతసూతి మనయింట వసించు నఁటంచుఁ, బంకమున్
బొంకము మీఱఁ బోరి జయమున్ గొను నంచును రిత్తయాసతోఁ
జంకలు వైచుకోకుము నృశంస ! సుయోధన ! నేఁడో రేపొ ని
శ్శంక భవన్మనోరథము సర్వముఁ గూల్చెద భేదయుక్తిమై.

ఆ కర్ణుం బిలిపింతు– "పాండవులు వత్సా ! నీసమానోదరుల్
నీకున్ వారికి యుద్ధ మేమి ?– విను కుంతీజ్యేష్ఠపుత్రుండ వై
సాకల్యం బగు ప్రేమతో ననుజపక్షం బూని శత్రుక్షయం
బాకల్పింపు" మఁటంచు వేఁడెద– నతం డాపాటి మన్నింపఁడా ?

ఎన్నేనిన్ బ్రతిమాలి చెప్పితిని "తండ్రీ ! నాసుతుల్ ధర్మసం
పన్నుల్, వార లరణ్యాఖేదము సహింపన్ లేరు పిల్పింపు, మీ
న న్నేడ్పింపకు మన్నదమ్ములకుఁ బంతం బేమి ? మీ ర్మీరుఁ బ్రే
మౌన్నత్యమ్మున నుండుఁ" డంచు వినినావా ! దుష్ట ! దుర్యోధనా ?

స్త్రీ నై యాపయి వృద్ధ నై విధవ నై దీనమ్ముగాఁ గుంతి యే
డ్చో యున్మాదిని వోలెఁ ద్రేలె నని యభ్యూహించితే గాని యీ
స్త్రీయం దెట్టిమహత్తరాసితరశక్తిప్రజ్ఞ లేపారెనో
నీయాత్మన్ గనకుంటి విప్పుడయినన్ వీక్షింతువో కౌరవా !

త్వరలోఁ జూచెదు పాండురాజమహిషీప్రజ్ఞావిశేషమ్ములన్
బరిపూర్ణప్రతిపన్న పాండవధనుఃపాండిత్యశౌండీర్యమున్
ధరణిం బుట్టినదాది నీసలుపు దుస్తంత్రౌఘ మీనాఁటికిన్
బరిణామోన్ముఖ మయ్యె దీని నెవ రాఁప న్నేర్తు రిప్పట్టునన్ ?

నామేనల్లుఁడు కార్యవాది యగుకృష్ణస్వామి లోకావన
వ్యామోహమ్మున రాయబారి యయి రానైయుండె, రాని మ్మతం
డే మే మాడునో ! అంధుఁడున్ దనయు లేయేరీతి మన్నింతురో !
ఏమార్గమ్మున వత్తురో ! తెలియు నేఁడే విశ్వవిఖ్యాతమై.

వారున్ వీరును యుద్ధయత్నముల నిర్వర్తించి క్షత్రోచితా
చారం బౌటను రాయబారము లిటుల్ సాగింపఁగాఁ జూచుచు
న్నారే కాని నిరంతరప్రళయచిహ్నంబుల్ జగద్భీషణ
ప్రారంభమ్మున మున్నె తోఁచినవి విస్పష్టమ్ముగా నెల్లెడన్.

# కృష్ణ సమాగమము

రమ్మోయీ ! యదునందనా ! చివికి జీర్ణం బైన యీవృద్ధజీ
వమ్మున్ బ్రేమసుధాభిషిక్త మొనరింపన్ వచ్చినావయ్యా ! నే
మన్నె ద్రౌపదికోడఁ బాండవుల, కష్టం గూర్చి వా రేమివా
క్యమ్ముల్ పల్కిరి, విస్మరింపరు గ దయ్యా పూర్వవృత్తాంతముల్ ?

"ఏనున్ మీ వెనువెంట వచ్చెదను తండ్రీ !" యంటి నానాఁడె, "అ
మ్మా ! నీ వెక్కడ, కాన యెక్కడ, సహింపం జాల వాయత్నముల్
మానంగావలె" నంచు నంద శోకకంఠం బూని వాదించి నా
కూనల్ న న్నిట డించి యేగి రిది నీకు న్నచ్చెనే మాధవా ?

ఈ యింటం బడి మ్రగ్గుచుంటిఁ బదమూఁడేం డ్లయ్యె నాహారని
ద్రాయోగమ్ముల మాని, సంతతము పుత్రప్రేమకాంక్షన్ దప
స్యాయోగమ్మును బూని, యింతకుఁ బ్రతిజ్ఞాపూర్తిఁ గావించి నా
యాయుష్మంతులు వచ్చి రంటివి, ముకుందా ! ధన్యురాలం జుమీ !

వా రె ట్లుండిరి, పూర్వపుంబస నశింపన్ దీనులై చిక్కియు
న్నారో ! భావిశుభమ్ము నెంచుచు మహానందమ్ముతో నుండిరో !
ధీరత్వమ్మున నాపదల్ గడచి రంతే చాలులే ! భావికా
ర్యారంభం బెటు చేయ నెంచితిరి కృష్ణా ! మీరలున్ వారలున్ ?

అంధుఁ వృద్ధుని వేఁడి తత్సుతుల సభ్యర్థించి పక్షద్వయీ
బంధుధ్వంసక మైనవిప్లవము నాఁపం బూని యెట్లెట్టులో
సంధిం గూర్పఁగ వచ్చినాఁడవె యదుస్వామీ ! మహామోహగ
ర్వాంధుల్ కౌరవు లెట్లు విందురు భవన్న్యాయైకవాదమ్ములన్ ?

విదురుఁడు మున్నుగాఁ గలవివేకనిధుల్ వచియించినప్పుడున్
కదనములోన గోగ్రహణకాలమునం దమతారతమ్యముల్
విదితము లైనయప్పుడును విజ్ఞులు “ఛీ” యని తిట్టునప్పుడున్
కుదురనితిక్క కౌరవులకుఁ మఱి తీరునె వట్టిమాటలన్ ?

తానేమో యొకరాజరాజు, తనకుఁ దాసానుదాసుల్ మహీ
జానుల్ నేఁ, డని త్రుళ్లుచుఁ బొగరు మీసాల్ దువ్వుచున్నాఁడు దు
ర్మానగ్రస్తుఁడు కౌరవుండు, కనులారఁ జూచితిఁ మాధవా !
నే నీసంధి పొసంగ దంచుఁ దలఁతుఁ నీ వెట్లు యోచింతువో ?

“ఐదూళ్లైనను జాలు మా” కనుట “అమ్మా ! బిచ్చ” మన్నట్టులే
కాదా ! ధర్మజుఁ డింతబేల యనియేకాఁబోలు నిర్భీకుఁడై
ఆదుర్యోధనుఁ డింతత్రుళ్లిపడుఁ, గృష్ణా ! కృష్ణయుఁ భీముఁ డీ
ఖేదోక్తుల్ వినిరో ! సహించి యెటు లంగీకారముం జూపిరో ?

ఇచ్చిన నర్ధరాజ్యపద మి మ్మను; మట్లు పొసంగ దేనియున్
వచ్చినలోటు లే; దయిదుపల్లెలఁ గోరి గడింపకున్న చోఁ
జచ్చెదరో! పృథాసుతులు; శక్తియుఁ బౌరుష మేర్పడంగఁ దా
మిచ్చకువచ్చినంత గడియింతురు రాజ్యము వీరభోజ్యమున్.

వచ్చినవాఁడ వీయుభయపక్షములుఁ సుఖియింప జాతికిన్
పొచ్చెము రానియట్లు తలపోయుము- మేనమఱందులెల్ల నీ
నచ్చినత్రోవ మెత్తురు జనార్దన ! నిక్కపురాచబిడ్డకున్
బిచ్చపుఁగూడుకన్నఁ బృథివిం దగు నెత్తుటికూడు యుక్తమై.

నాసుతులెల్ల నీశిరముపై నిడి పంపినదౌత్యభార మె
ట్లో సవరింపు, మాపయి మఱొక్కటి యున్నది సర్వలోకహృ
ద్వాసుఁడ వైన నీ వెఱుఁగవా యది ?- దానిని నిర్వహించునా
యాసముఁగూడఁ బూనుము మహాత్మ ! భవత్పటుభేదనైపుణిన్.

సరి యీమాటల కేమి, యీసరికె భీష్మద్రోణకర్ణాదులున్
గురురాజన్యుఁడుఁ దత్సుతుల్ సచివులుఁ గూర్చుండి నీరాకకై
పరిలక్షించుచు నుందు రచ్చట భవత్ప్రజ్ఞాలసద్యుక్తివై
ఖరి దీపింపఁగ రాయబారమును వక్కాణించి సాధింపుమా.

# స మా లో చ న ము

అది యాశ్చర్యముగా వచింపకుము కృష్ణా! యెంతయత్నించినన్
"కుదురంజాలదు సంధి" యంచు మునుపే ఘోషించితి న్నే నహో!
కదనారంభవిధానము న్నెఱప సంకల్పించితే గాని య
య్యది సాధ్యేతర మంచు నీ వెఱుఁగవా అంతర్బహిర్వ్యాపకా!

సకలమ్ముం బిగఁబట్టి మొండితనమున్ సాగించుచున్ న్యాయ మెం
చక యీపాపపుబండిఁ దోలిరి దురాశాగ్రస్తులై వారు— నేఁ
డొకధర్మజ్ఞునిఁ దీర్పు సెప్పు మను మీయుర్వీతలంబెల్ల నే
రికి రాఁదగ్గదా! వృద్ధులుం గురులు లేరే తత్సభావేదికన్?

పడుచుఁదనంపుబింకమునఁ బాపముఁ బున్నె మెఱుంగరామిచేఁ
గొడుకులు వేగిరించి రనుకొమ్ము జనార్దన! యిన్నియేఁడులన్
గడపినవాఁడు, తండ్రి, యధికారి రవంత సధర్ముఁ డైన నా
కొడుకుల మందలించుకొనఁగూడదా! యాతనిమాట చెల్లదో?

ఇది దుర్యోధనుతంత్రమే యనుట నా కిష్టంబు గా దిందులోఁ
బదిపా ళ్లంధుఁడె కారకుం డనునభిప్రాయంబు ము న్నెన్నఁడో
కుదిరె న్నా కది తెల్ల మయ్యెఁగద నీకున్ గొల్వులో నేఁడు, త
ద్ధృదయోదగ్రవిషమ్ముచేఁ బెరిఁగి రోయీ! కౌరవుల్ నూర్వురున్.

కానీ యైనది రాయబార, మిఁకుపైఁ గర్తవ్యముం జూడు మె
క్లైనన్ దప్పదు యుద్ధ- మప్పు డొక ముఖ్యం బైనపాత్రంబు నీ
ప్రాణంబోవుటకూడఁ దప్ప దిపుడే యోచింపు పక్షద్వయీ
సేనాంగమ్ములుఁ దద్బలమ్ములు జయశ్రీసాధనోపాయముల్.

ప్రతిపక్షమ్మునఁ గుంభసంభవకృపాశ్వత్థామలున్ భీష్ముఁడున్
గ్రతువిధ్వంసికి నైన లోఁబడనివీరశ్రేష్ఠు, లవ్వారి ని
ర్జితులం జేయువిధమ్ముఁ జూడు మటుపై శిష్టమ్ము లౌమూకలన్
హతమార్పన్ మనయోధవర్యులకు దండాపూపికాన్యాయ మౌ.

ఇఁకఁ గర్ణుం డొకఁ డుండె, నాతనివిధం బే మయ్యె, నొక్కింతదా
రికి రాలేదా! యెఱింగెనో జననచారిత్రంబు సర్వమ్ము? నీ
చకులస్నేహము లింతచేసినవి కృష్ణా! వానిఁ, దప్పింతుమే
ఒకసూతాత్మకుఁ డై మృతింపఁ గలదుర్యోగంబు రానుండఁగా.

నేనుం బిల్చెద, వచ్చెనా సరి, మదాంధీభూతచేతస్కుఁ డై
రా నన్నన్ మన నేమిచేయుదుము, కౌరవ్యాళితోఁ బాటుగాఁ
దానుం జచ్చునొ, చచ్చి నాయెడఁదఁ జింతాజ్వాల రెట్టించునో?
కాని మ్మాతనిఁగూర్చి యేడ్వనిదినమ్ముం గల్గెనే మాధవా?

సరె తే యప్పుడె చూచుకొంద మని కృష్ణా! తెమ్ము నీబావ లం
దఱు నీకోసము వేచియుందురు, ప్రస్థానం బింక సాగింపు, మీ
కురురాజన్యసభావిశేషముల వ్యాఘోషించి యవ్వారలన్
బరికల్పింపుము సంగరోన్ముఖులుగా భద్రానుసంధాయి వై.

"ధరపై క్షత్రియకాంత వీరజననీత్వ మ్మొక్కటే జన్మకున్
బరమార్థమ్ముగఁ జూచుఁ గాని తనయుల్ వైరాగులై కానలన్
దిరుగ న్నేరిచి సంగరం బనిన భీతిం జూపుచో నామె యా
నరకమ్మున్ సహియింపఁజాల" దని కృష్ణా! చెప్పుమీ వారితో.

"మఱవంజాలుట యుక్తమే మును సభామధ్యమ్మునన్ ద్రౌపదిం
జెఱుపం బూనిన వారిదుర్ణయము లిస్సీ! యామె నోదార్పరో?
హారసంప్రాప్తము లైనయస్త్రముల నౌరా! త్రుప్పు పట్టింతురో?
సరిగా యోచనఁ జేసికొ" మ్మనుచుఁ గృష్ణా! చెప్పుమీ వారితో.

నడుపం జాలిననేత వీవు భవదాజ్ఞాబద్ధు లాపాండవుల్
నడుముం గట్టుము పార్థసారథిగఁ గృష్ణా! ప్రస్తుతోపద్రవం
బడఁగింపన్ మఱి నీవు గాక యెవ రయ్యా కార్యనిర్వాహకుల్?
తడ వేలా యిఁక ధర్మరాజ్యమును సంస్థాపింపఁ బొ మ్మచ్యుతా!

# విఫలానునయము

మును లజ్జాకరుణావిహీన నయి దుష్టబుద్ధిన్ ప్రవాహమ్మునన్
దనయా ! ని న్నిరవాటు వెట్టితి ననంతం బైనవిశ్వమ్మునన్
గనలే మిట్టివిషాదసంఘటన, నిక్కం బెంచి మన్నింతువో !
జననీరూపపిశాచికిం దగుతిరస్కారంబు సారింతువో !

ఏను విపన్న నౌచు నెటు లేడ్చితినో ! పనిబట్టి నాబహిః
ప్రాణమ వైన ని న్ననద నై విధిలేక పరిత్యజింపఁగాఁ
బూనుచు నెంతగా వడఁకిపోయితినో ! మఱి యెట్టు లైతినో !
భానుఁ డెఱుంగుఁ గాని పెరవార లెఱుంగరు నమ్ము నాయనా !

అది యనివార్య మై తపనునానతి యై పెరదారి కింత వీ
లొదవని యేముహూర్తముననో జరిగెన్ మఱి నాఁటినుండియున్
హృదయ మశాంతివహ్ని దహియింపఁగ నెట్టెటొ యింతకాలమున్
బ్రదికితిఁ జేసికొన్నయపరాధము నీకడఁ జెప్పికొంటకై.

వినుమా నానుడి నిక్కమంచు నదిగో విస్పష్టగంభీరని
స్వనుఁడై చక్కఁగ నంబరస్థుఁ డయి సాక్ష్యం బిచ్చుచున్నాఁడు నీ
జనకుం డైనదివాకరుం, డిపుడు నీసందేహముల్ మానవో !
తనయా ! నీకొఱ కేడ్చుతల్లిపయి నిందాదృష్టిఁ బోనాడవో ?

ఔరా ! నాతనయుండ వయ్యు నిటుఁ గర్ణా ! యన్యులం గొల్చు నీ
ప్రారబ్ధమ్మున కేమనందు ? నిఁక రారా ! మాతృవాత్సల్య మిం
పారం గొందువుగాని తజ్జనితపూర్ణామోద మేపారఁగాఁ
బాఱంద్రోలుదుగాని నేఁటిపరసేవారూపమహానైచ్యమున్.

మాతను ధిక్కరించుచు నమాయికుఁడా పనిబూని నీయసు
వ్రాతము మీఁదుఁగట్టితివిరా యొకతుచ్ఛునిసేవకోసమై-
ఈతలతిక్కధర్మముల నెక్కడ నేర్చితి వాత్మజాళికిన్
మాతృసపర్యకన్నఁ బెరమార్గము లున్నవె ? ధర్మ మున్నదే ?

"నన్నే నమ్మె సుయోధనుం, డతని కన్యాయంబుఁ గావింతునా ?"
యన్నా వయ్యది నిక్కమే యయిన మధ్యస్థుండ వై యిప్పు డా
సన్నం బైనరణంబు మాన్పు, మెటులో సంధింప యత్నింపు, మా
నిన్నే నమ్ముట యెట్టిదో తెలిసెడిన్ నీపిచ్చియుం దీఱెడిన్.

తమ్ములతోడియుద్ధము గదా ! మఱి వారలఁ జంపి యేమిధ
ర్మమ్మును మూటఁగట్టెదవురా ! అవురా ! కరుణావిదూరుఁడా !
అమ్మను గోసి చంపు, మది యర్హము- తమ్ములనైన నింతన్యా
యమ్ముగ నాదరింప వలదా ! జలజాప్తసుతుండ వింతకున్.

"తెంపరి వై సుయోధననిదేశము నొదలఁ దాల్చి యర్జునుం
జంపెదఁ జేతకానియెడఁ జచ్చెద నంతియకాని చిక్కినన్
జంపను తక్కువారి" నను సాంత్వన మేటికి, నన్నదమ్ములై
చంపినఁ జచ్చినన్ ఫల మశాంతియె కాదె వివేకహీనుఁడా ?

నాపై నీ కొకకోప మున్నయెడఁ గర్ణా ! యిప్పుడే ఖడ్గధా
రాపాతమ్మునఁ జంపుమయ్య ! కసి దీఱ న్నన్నుఁ— గాదేని ని
ష్కాపట్యమ్మున రమ్ము ! తమ్ములప్రతిష్ఠ న్నిల్పు మీయాపదన్
బ్రాపై నిల్వుము కీర్తిఁ గొమ్ము విడుమా వ్యర్థప్రసంగమ్ములన్.

గాండీవమ్మునఁ గూర్చి పాశుపత ముగ్రంపశ్యుఁ డై వైరులన్
జెండాడన్ జెలరేఁగుపార్థునెదుటన్ జీవమ్ముతో నిల్చును
ద్దండుం డెవ్వఁడు ? సూతసూతి వయి సోదర్యాశుగజ్వాలలో
మండన్ జూతువుగాక యేజనని సంభావించు నీదుస్థితిన్ ?

అక్కజ మైన మాతృహృదయమ్ము నెఱుంగనిరాతిగుండెతో
నెక్కినగుఱ్ఱముం దిగక యెంతగ నన్నుఁ దిరస్కరించినన్
మక్కువ వోదు నీపయి— నమానుష మయ్యది— యింకఁ జెప్పఁగా
నక్కఱ లేదు పొమ్ము తనయా ! భవితవ్యము దాఁట శక్యమే ?

# విలాపము

ఏ మన్యాయము దుర్విధీ! యిది? త్రిలోకైకప్రతాపాఢ్యుఁడున్
ధీమంతుం డనఘుండు భార్గవునియంతేవాసి భాస్వద్యశో
ధాముం డర్థిజనావనుండు సుగుణాధారుండు శ్రీభాస్కర
ప్రేమాంకూరము నైనకర్ణుని రణోర్విన్ గూల్చినా వక్కటా!

గురుశాపమ్మును గృష్ణవైర మటుపై గోత్రారిదుస్తంత్రముల్
ధర నింద్యమ్మగుదుష్టమైత్రి యటుమీఁదన్ శల్యసారథ్యమున్
బరిపక్వమ్మగుకర్మదోషమును సంపన్నప్రభావంబు లై
నరుబాణమ్మున నావహింప నిటు కర్ణా! మట్టిపా లైతివే?

"లోకమ్ముల్ తలక్రిందు లైన నొకదుర్లోభంబు సాగించుచున్
నాకర్తవ్యము మాననేరను కృతఘ్నత్వమ్ముకో జీవితం
బాకాంక్షింపను పొమ్ము తల్లి! భవదీయప్రేమకున్ నానమో
వాకమ్ముల్ గొను" మన్నధర్మనిధి! నీభాగ్యమ్ము లి ట్లయ్యెనే?

భూతలదుర్లభంబు లగుభోగము లందితి, దానవీరవి
ఖ్యాతి గడించుకొంటివి, మహాత్ముఁడ వై తతసత్యధర్మని
ష్ణాతుఁడ వై మెలంగితి వచంచలనిశ్చయ మూని నేఁడు చేఁ
జేతల ధారవోసితివి జీవితమున్ గురురాజమైత్రికై!

జనసామాన్యతిరస్క్రియార్హముగ వత్సా ! నాదుగర్భమ్మునన్
జననం బందుట దక్క యన్య మగుదోషం బింతయున్ లేని పా
వన హా తావకజీవితం బిటు సమాప్తం బయ్యె దుఃఖాంతమై
తనయా ! భారతభావిభాగ్యము నిరాధారంబు నీలేమిచే.

"పుడమి దృఢమ్ముగా బిగిసిపోయినచక్రము నెత్తివచ్చెదన్
విడువకు మర్జునా ! శరము, విశ్రుత హా రణధర్మ మింతగా
విడిచితివా ?" యఁటంచు మొఱవెట్టుచునున్నను గృష్ణునాజ్ఞఁ బా
ర్థుఁడు నినుఁ గొట్టి చంపెనఁట దుష్టుఁ డిసీ ! యెటు చేతులాడెనో ?

అన్నా ! ఫల్గున ! యేల కా లిడితివయ్యా యీయధర్మమ్మునం
దన్నన్ దివ్యయశఃప్రపూర్ణు విరథున్ దృక్తాస్త్రు నేకాకి నా
పన్నుం జంపఁగ నెట్టు లొప్పె మన, సబ్బా ! "యాతఁ డస్త్రంబె చే
కొన్నన్ బ్రాణము దక్కనీయఁ" డని నీకున్ గుండె లల్లాడెనో ?

పోరిత మెట్టులో ముగిసిపోవును గాని ముకుంద ! నీమహా
దారతకున్ గళంకము గదా ! భువి నిట్టియధర్మకృత్యముల్ ?
వార లధర్మయుద్ధమునఁ బార్థసుతున్ బొరిఁగొంటకున్ బదుల్
దీరిచినావా ! యిట్టియుపదేశ మొనర్చితి నేఁడు క్రీడికిన్ !

అన్నులే ! నామతి మండిపోను ! పరమాత్మా ! కర్ణ నీనాఁడు మీ
రెవరో చంపితి రంచు నేఁడ్వఁ బని యేమీ నాకు, నవ్వాని ను
ద్భవకాలమ్మున నేనె చంపితిని గాదా నీళ్లలోఁ ద్రోసి ? యా
యవమానమ్మున గ్రుంగుచుంటివి గదమ్మా నాఁటికిన్ నేఁటికిన్ ?

విడిచితి నంచు న న్నిఁక శపింపకు మోమ్మృతజీవి ! కర్ణ ! నిన్
విడిచినదానికన్నఁ బదివే లధికం బగుశిక్ష నాత్మలోఁ
గుడుచుచునుంటి నేఁటివఱకున్, మఱి నా తెరగాథయే బయ
ల్పడు నెడ నెట్టిశిక్ష తలపైఁ బడనున్నదొ సంఘమం దిఁకన్.

అన్యదురాపసద్గుణగణాంచిత ! యోనుతకీర్తి ! యెంతయున్
ధన్యుఁడ వీవు, నీమృతియు ధన్యము ధర్మనిబద్ధ మౌటచే
మాన్యము నద్వితీయము ననూనుపలభ్యము నైన దాతృమూ
ర్ధన్యపదమ్మున న్నిలుచుఁ దావకనామము శాశ్వతంబుగా.

అనుకూలం బగుదారిఁ జూప నినుఁ డాహ్వానించుచున్నాఁడు నిన్
బునరావృత్తినివృత్తలోకముల కంపు న్నిర్విచారమ్ముగాఁ
జను మోవీరశిఖామణీ ! మొరడునై జన్మాంత మీఁచిచ్చు నా
వెనువెంటం బయనింపఁగా బ్రదికెదన్ విశ్వైకగర్హ్యమ్ముగా.

# అభిజ్ఞాపనము

ఈవిజయోత్సవంబు లభియించినదయ్యును బంధురక్తసం
ప్లావిత మై వధూజనవిలాపకళంకిత మై ప్రబాధితో
ర్వీవలయమ్ము నై మదికి బెంగల నింపుచు నుండెఁ గాని మో
దావహ మాట లేదు సుతులార! యథార్థము నెంచిచూచినన్!

కలసర్వస్వము రాజభక్తికొఱకై కాకల్పించు త్యాగైకమూ
ర్తులు వైవస్వతు లెక్కసేయని మహాదోర్వీర్యసంపన్ను లు
జ్జ్వలతేజస్కులు భారతీయులు జగద్ధారేయవీరాగ్రణుల్
బలియైపోయిరి ఘోరయుద్ధమునకున్ లక్షోపలక్షల్ కటా!

చచ్చినబంధుసంతతికి శాంతి ఘటిల్లఁగ నీనివాప మం
దిచ్చుటకన్న వారిఋణ మెట్టులు తీర్తుము లెమ్ము నాయనా!
ఇచ్చట నొక్కమాట వచియింపక తప్పదు, మీ రెఱుంగ కే
చచ్చెను సోదరుం డొకఁ డొసంగుము ముందుగ వాని కంజలిన్!

నిన్నున్ నీసహజన్ములన్ విజయసందిగ్ధాత్ములం జేయువీ
ర్యోన్నత్యమ్మున మించి కాలగళితుం డై కీర్తిదేహమ్ముతో
నున్నాఁడే కద! సూతసూతి యని మీ రూహించుకర్ణుండు? వాఁ
డన్నా! మీకు సహోదరుం డగును;- కృష్ణా! చెప్పు మావృత్తమున్.

మూపైఁ గన్నుల నెఱ్ఱఁజేయుమనె భీమా ! అర్జునా ! నన్ను నీ
చాపాగ్రమ్మునఁ గొట్టవత్తువె ! కవల్ ! సైరింపుఁ, డో ధర్మజా !
శాపం బిచ్చినమాత్ర నేమగుఁ ? బిశాచప్రాయమై సర్వథా
పాపాచారిణి యైనతల్లిని వధింపన్ [illegible] రం డందటున్.

ఎప్పటికప్పు డీవిషయ మెల్లను మీకడ విస్ఫుటమ్ముగాఁ
జెప్పఁగఁబోయి నో ర్వెడక చెప్పకయుంటిపుఁ దృప్తి లేక యీ
యుప్పెనవంటివిప్లవము నూరక యాత్మ నడంచిపెట్టితిన్
''త" ప్పని యేడ్చి యేడ్చి "భవితవ్యము లె'' మ్మని యూఱడిల్లితిన్.

అక్కడకున్ దెగించి హృదయవ్యథతో నొకసంజవేళ నీ
నిక్కపుగాథ కర్ణునకు నేర్పుమెయిన్ వివరించి చెప్పితిన్ !
మక్కువమీఱఁ బిల్చితిని మాటకు మాటకు నుత్తరమ్ములన్
చక్క నొసంగి వేఁడితిని జక్రధరుం డెఱుఁగున్ సమస్తమున్.

పూనిక నన్నదమ్ములకుఁ బొందు ఘటించెద నంచు నాసతో
నేను ప్రియంబుమీఱ నతనిం గని ''తమ్ములతోడి యుద్ధమున్
మానుము నాయనా ! తనకుమాలిన ధర్మమె ?'' యంచు మొత్తుకొ
న్నా ననుమాటె గాని వినెనా, తనపట్టినపట్టు వీడెనా !

అనుజులతోఁడియుద్ధమునకై యుబలాటము పడ్డవాఁ డెటుల్
జనని ని మెచ్చు?— నామె యనుశాసనముల్ గ్రహియించు? మీపయిన్
బనిఁ గొని కత్తి నూరి నయభాగ్యుఁడు చచ్చెను— వానికోసమై
వనరుట కర్థ మున్నదియె పాండవులార! తలంచిచూడుఁడీ.

సంగరసీమలోఁ బసుపుచాయలబట్టలవాని నాజగ
న్మంగళమోహనాంగు నభిమన్యునె మ్రింగితి— మంతకన్న నీ
యంగవిభుండు మీ కధికుఁడా? విరమింపుఁడు దుఃఖ, మెంతగాఁ
గ్రుంగిన నెంతత్రవ్వుకొని కుందినఁ జచ్చినవాఁడు వచ్చునే?

ఈయన్యాయచరిత్రముల్ విడువుఁడోయీ! యింక మీరైన దీ
ర్ఘాయుష్మంతులరై మహీవలయ మేకాధీశులై యేలి స్వే
చ్ఛాయోగమ్మునఁ బాండుభూపతిప్రతిష్ఠ న్నిల్పి వర్ధిల్లుచో
నాయాదర్శము చెల్లిన ట్లగును జింతల్ వంతలున్ వ్యర్థముల్.

చచ్చినయన్నకున్ హృదయశాంతి లభింపఁగ నంగరాజ్యమున్
మచ్చికమీఱ నాతనికుమారుల కిండు, తదీయవంశమున్
నిచ్చలుఁ జూచుచుండుఁ డొకనింద్యపథమ్మును బట్టకుండఁగా
మెచ్చును లోకముల్, హరియు మెచ్చును, మెచ్చును బంధువర్గముల్

# ప్రస్థానము

అన్నా ! ధర్మజ ! "అట్టులే సెలవిమ్మమ్మా !" యంచు సంతృప్తి మీ
రన్నన్ స్వేచ్ఛగఁ గాన కేగి పరసౌఖ్యశ్రీ నుపార్జింపఁగా
సన్నాహమ్ములఁ జేసికొందు— సెల వన్నా ! తల్లి నై యింటిలో
నెన్నా ళ్లుందును వెఱ్ఱితండ్రీ ! విసు వయ్యెన్ బట్టణావాసముల్ !

మీరలు సార్వభౌము లయి మేదిని నేలెడిభాగ్య మిట్లు క
న్నారఁగఁ జూచుకొంటిఁ, జిరయత్నము సార్థక మయ్యె నా కటన్
గోరిక యొండు లేదు, భవకూపమునుండి తరింపఁజేయు వ్యా
పారముఁ బూనఁగా వయసు వచ్చెను, పోవఁగనిండు నన్నికన్.

ఒకచిరవిప్లవం బడఁగియున్నది చిత్తములోన— దానితోఁ
దికమకలాడుచుంటకుఁగదే ! సరిపోయెను జన్మమెల్లఁ, గా
నకుఁ జని సుస్థిరం బగుమనంబున దాని జయించి శాంతిదా
యక మగుత్రోవఁ గందు, నెదు రాడక పోవఁగనిండు నన్నికన్.

"ఇందఱిఁ జంపి రాజ్యపద మేల యమర్చితి వమ్మ ! మాకుఁ, బో
వం దలఁ పున్న ము న్నడవిబాటల పీడక యేల తెచ్చినా"
వందువె వాయునందన ! మహామతిమంతుఁడ వోయి ! రమ్ము ర
మ్మందఱి నుద్ధరించుకొనినందుల కర్థము నేఁడు చెప్పెదన్.

పరమపదించె మీతలలపైఁ దడి యాఁటకమున్నె పాండుభూ
వరుఁ డొకకాననాంతరనివాసమునన్ మిము వీడి యప్పు డిం
దఱ సవరించుబాధ్యతలు నాతలపైఁ బడియుంట హస్తినా
పురమును జేర్చి పెంచి తగుబుద్ధులు చెప్పితి నుద్ధరించితిన్ !

నాకొడుకుల్ దరిద్రు లయినన్ బ్రదుకం దగువారి గానఁగా
రాక జగాన నెట్టియుసరా లభియింపక యేడ్తురో ! కదన్
లోకువ చూడరో ధనికలోకముముందఱ, నంచు నిన్ని "పు
త్రాకుల" నందితిన్ బెనఁగు లాడితి నిప్పటి కింత చేసితిన్ !

దాయాదుల్ పసినాఁటినుండియు దురంతం బైన యుష్మద్వధో
పాయాన్వేషణముం బొనర్చినపశుప్రాయుల్ గదా, మీరు త
న్మాయామూలమున న్నశింతు రనుచింతన్ జీవితంబెల్ల మీ
కై యర్పించితిఁ జాటిచూపితిని సుక్షత్త్రప్రభావం బిలన్ !

ఖలులు సభాస్థలిన్ విజయగర్వముతో మును వల్వ లొల్చి మీ
కులసతికిన్ బరాభవముఁ గూర్చిరి, మిమ్ములఁ గాననాంతర
స్థలముల కంపి, రట్టిదురితమ్ములకున్ దగుశిక్షఁ జూడఁగా
వలయుఁగదా ! యటంచు నిలువంబడితిన్ బ్రతికారదృష్టితో.

ఇంతియెకాని నేను సుఖియించుతలంపున నిన్నినాళ్లు మీ
చెంత వసింపలేము, తెలిసెన్ గద నందనులార! పాండుభూ
కాంతునిరాజ్య మేలునధికారులు మీరు సుఖింపుఁడయ్య! ని
శ్చింతగఁ దత్పదం బఖిలమించెదఁ బోవఁగనిండు నన్నికన్.

పెద్దవు నీవు తమ్ములను బెంచుము గౌరవ మొప్ప, నీకవల్
విద్దెము నేర్చికొన్న పసిపిల్లలు, తల్లి నెఱుంగ, రిట్లు నా
పెద్దఱికమ్మునన్ గనులు విప్పిరి- వీరల కెల్లకాలమున్
ముద్దులు ముచ్చటల్ జరుగుపోడిమి చూడుము ధర్మనందనా!

భూపతి కర్తధర్మపరిపోషణమం దొకహద్దు లేదు కా
మోపగమమ్ము ధర్మసమయోచితమై తగు మోక్షసాధన
వ్యాపృతి నిత్యశాంతినిలయం, బది కాదనరాదు, చక్కఁగా
నీపురుషార్థముల్ తెలిసి యేలుము రాజ్యము ధర్మనందనా!

అంతేవాసులు మీరు భీష్మునకు ధర్మాధర్మవిజ్ఞానమం
దంతేవాసులు గండు కృష్ణునకు నర్థానర్థవిజ్ఞానమం
దంతర్వాణులు మెచ్చ నేలుఁ డవనిన్ యావత్ప్రజాకోటికిన్
జితం దీర్పుఁడు నేఁడు భారతపునర్నిర్మాణభాగ్యమ్మునన్.

# నిర్వాణము

ఊరక గూండ్లు కట్టుకొని యున్నవి బెంగలు చిత్తమందుఁ– గాం
తారము చిత్తశాంతి కొకదారి గదా యనుకొంటి, నద్ది చే
కూఱుట కెన్ని యోగములు కూడవలెన్ మునినాథ ! యింతకున్
మాఱదు చిత్తవృత్తి యణుమాత్రము– నాగతి యేమి యిచ్చటన్

కనులన్ మూయుచు ధ్యానముద్రకయి సంకల్పింతు– వెన్వెంటనే
వినుపించున్ శిశురోదనంబు లటుపై వీరాట్టహాసంబులున్,
గనుపించున్ మృతవీరదేహము లసంఖ్యాకమ్ములై, కర్ణుఁడే
వెనుక న్నిల్చి హసించిన ట్లగును కంపింతున్ భయోద్విగ్నునై.

ఒకసంధ్యాసమయమ్మునన్ రవికి నర్ఘ్యోపాయనం బిచ్చుచుం
ఐకతో నిల్చితి బాలసూర్యుఁ గనుఁగొంటిన్, జిత్ర మాతండు న
న్నొకసక్కెమ్మున వెక్కిరించినటు లయ్యెన్ మత్సమీపమ్మునం
దొకసద్యోజనితుండు దీనముఖుఁడై యున్నట్టు లయ్యె న్మునీ !

పాఱంబోసితిఁ జేతిలోనిజలమున్ బర్వెత్తితిన్ నాకుటీ
ద్వారప్రాంగణసీమదాక, నొకదౌర్బల్యంబు నామానసం
బారోహించెను నాఁటినుండి రవి కర్ఘ్యం బిచ్చుటే లేదు జ్ఞా
నారంభమ్ములు లేవు డాంబికము దేవా ! నానివాసం బిటన్.

భానువరప్రసాదపరిపాకమునన్ జనియించె నంచు నా
సూనుని బెద్దతల్లరకుఁ జూపి సుఖమ్ముగ నింటఁ బెంచుకో
లేనియధైర్య మిట్లు కబళించెను న, న్నకఁ జెప్పనేటికిన్
మానివరేణ్యా ! యీకపటనాటకకర్తయు భానుఁడే సుమీ ?

తాలిమి మంచిచెడ్డలయథాతథమ్ముం గుఱుతించువారు స
చ్ఛీలురు మిమ్ముఁబోంట్లు వినుతింతురుగాక ! యొకప్పు జేసియున్
దేలికఁ జూచువారుఁ జెడఁదిట్టెడివారును జాటుచాటుగా
మూలుగువారునున్ ధరణిఁ బుట్టకయుందురె మానిశేఖరా ?

స్వామీ ! పంచమవేదరూపమున విశ్వవ్యాప్తిఁ జేకూర్పఁగాఁ
దా నేమో రచియింపనుంటిరఁట కాదా ! భారతాఖ్యానమున్ ?
స్త్రీమర్యాదను వీటఁబుచ్చిన ననుం జిత్రించుఘట్టమ్ములన్
మామా ! యించుక సంశయింపక యధర్మంబే నిరూపింపుఁడీ !

దీనిని ధర్మబద్ధముగ దిద్దుటకై యెవ రెన్నిరీతులన్
బూనిన లాభ మేమి ? యొకపూపదనమ్మునఁ గన్నె నయ్యు సం
తానముఁ గాంచితిన్, దివసనాయకుఁడో మఱి వానితాతయో
దానికిఁ గారణం బనుఁడు ధర్మవిధుల్ నను గౌరవింతురే ?

చిరగత మైన యీహృదయచింత జయింపఁగ నెంతచూచినన్
మరణముకన్న నన్య మనుమార్గము తోఁచదు- పూజ్య మైన మీ
చరణయుగమ్ము చెంత నది సాగిన యీదురదృష్టజీవికిన్
నరకము సంభవింప దని నమ్మిక మున్నది మౌనిశేఖరా !

నాయపచారఘోరపరిణామఫలమ్మునఁ దాను బాధ్యుఁడై
పోయెను గర్ణుఁ డేసుకృతపూర్ణులు పోయెడిదివ్యభూమికో !
ఓయతివర్య ! మీకరుణ యుండినచో నొకమాఱు వాని నా
ప్యాయము మీఱఁ జూచుకొనుభాగ్యము పట్టదె నేఁడు నా కిటన్ ?

చాలును స్వామి ! నైజకవచస్ఫురితుండును దివ్యకుండల
శ్రీలలితుండు శాంతిమధురీకృతహాసుఁడుఁ గర్ణుఁ డల్లదే !
బాలదినేశమండలముభాతిని నీకరుణాస్రవంతిలోఁ
దేలుటఁ జూచుకొంటి నిఁకఁ దీఱె సమస్తము చిత్తభారమున్ !

ఈయానందము తీఱిపోవుటకు మున్నే నేను శాంతమ్ముగా
డాయం బోయెద నాప్రియాత్మజుని, క్లిష్టం బైన నాజీవితా
ధ్యాయం బిట్లు ముగింపనిమ్ము ! పరమేశా ! నిత్యకళ్యాణమూ
ర్తీ ! యానందకళావధీ ! విమలశాంతిజ్ఞానసుశ్రీనిధీ !

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 10 | 1 | కష్టలి (అభిప్రాయములు) | కష్టవి |
| 7 | 16 | క్షుత్పిపాసకల్ | క్షుత్పిపాసకుఁ |
| 30 | 9 | నీశిరముపైనిడి పంపిన | నీశిరమునన్నెలకొల్పిన |
| 32 | 16 | కానిమ్మాతనిఁగూర్చి | పోనిమ్మాతనిఁగూర్చి |

త్వరలో

# ఆంధ్రానందరామాయణము

9000 గద్యపద్యములు

అరుణాశ్రమ ప్రచురణము—2.

అనువాదము

కీ॥ శే॥ గుండు లక్ష్మణశాస్త్రిగారు

పీఠిక

కీ॥ శే॥ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు

సంపాదనము

గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి